# గోపికా హృదయోల్లాసం

రచన :

ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం

చైతన్య వివృతి

డాక్టర్ కె. గిరిజా లక్ష్మి, యం.ఫిల్., పిహెచ్.డి.

ప్రచురణ :

శ్రీ గిరిజా ప్రచురణలు

ఓ-31, శ్రీనివాసనగర్ - గుంటూరు-6

ఫోన్ : 230086

# గోపికా హృదయోల్లాసం

**Gopika Hridayollasam**
A devotional poem



ప్రథమ ముద్రణ : మార్చి, 1997
ప్రతులు : 750

ధర : రూ. 30/-
ముప్పది రూపాయలు
Rupees Thirty

కృతజ్ఞత

ఈ కావ్య ముద్రణార్థం
ఆర్థికసహాయ మందించి, ప్రోత్సహించిన
శ్రీమత్తిరుమల తిరుపతి దేవస్థానం వారికి
కృతజ్ఞతాభివందనాలు.
ఏడుకొండలసామికి ఏటికోళ్లు.

ప్రతులకు :

శ్రీ గిరిజా ప్రచురణలు
విద్యాలంకార్, ఓ-31, శ్రీనివాసనగర్
గుంటూరు - 522 006
ఫోన్ : 230086

# ముందుమాట

ఇది 'గోపికా హృదయోల్లాస' మనే గేయసల్లాప కావ్యం.

శ్రీకృష్ణ బాలపరమేశ్వర దివ్యసందర్శన సౌభాగ్యంవల్ల గోపకాంతల గుండె లోలోతుల నుండి వెలువడ్డ భావతరంగాలివి.

*"మన యశోద చిన్ని మగవాని గనెనట!*
*మాచిపత్తి మమ్మ! సుదతులార!!"*

అన్న పోతనార్యుని సురుచిర సుందర వాఙ్మననం ఈ రచనకు ప్రేరణం.

ఇందులోని గేయాలు అధికంగా శ్రీగౌరాంగ, మోక్షసాధని, సప్తగిరి వంటి పత్రికల్లో ప్రచురితాలు. చాల సభల్లో పఠించినవి. ఇపు డిట్లా కావ్యరూపం ధరిస్తున్నాయి.

ఇవి మూ డుల్లాసాలుగా వింగడింపబడ్డాయి :



ఈ కృతికి 'చైతన్యవివృతి' విరచించింది - మా అమ్మాయి, సౌభాగ్యవతి డాక్టర్ కె. గిరిజాలక్ష్మి. ఈ వివృతి విశేషంగా భాగవత విస్ఫూర్తి కోసమే. బాలకృష్ణుడి దీవెన, ఈమె కుటుంబాన్ని సదా అనుగ్రహించాలని నా వేడ్కోలు. దీన్ని అర్ధశతాబ్దం 'శ్రీకృష్ణ జన్మాష్టమి' వ్రతం ఆనందోత్సాహాలతో ఆచరించి శ్రీకృష్ణ సాన్నిధ్యం చేరిన మా అక్కయ్య కొత్రా వసుమతమ్మగారి కంకితం చేసి ఆనందిస్తున్నాను.

నా వ్యాసంగాన్ని అభిమానించే దంపతులు శ్రీయుతులు డాక్టర్ సుధా నాగేశ్వరరావుగులకు, సి. కుసుమకుమారీ తాండవకృష్ణులకు (విజయవాడ) నా అభినందనలు.

దీని ముద్రణంలో అత్యంత శ్రద్ధ వహించిన శ్రీలక్ష్మి ప్రెస్ యజమానులు, సౌజన్యమిత్రులు శ్రీ కాట్రగడ్డ బ్రహ్మయ్యగారికి, వారి కుమారుడు, చిరంజీవి శ్యాంబాబుకు నా నెనరు.

బొడ్డుపల్లి పురుషోత్తం
రచయిత

# ఆతడెవడు? మన కన్నయ

సుందరమగు వస్తు వితతి
అందించెడి వాడెవండు?
    చిన్నపెద్ద జీవరాశి
    కన్నతండ్రి ఆతడెవ్వడు?
విచ్చుపూవై నునుమొగ్గం
కిచ్చు నెవడు సువాసనలు?
    కిలకిలమను పిట్టలకై
    మలచె నెవ్వ డీరురెక్కలు?
కొండదారుల కే భవ్యుడు
నిండుగుండె లోనరగూర్చు?
    సెలయేళ్ళ కెవండు నేర్పు
    సలలితమౌ నృత్త గరిమ?
పురులువిప్ప నెమిలి గమికి
నెరపు నెవడు లాస్యావళి?
    ఎవడు సాగరాంతరాల
    ప్రవాళములు భద్రపరచు?
ఎవడు నిర్మలాంబరాన
పువ్వుచుక్కలు చక్కగ్రుచ్చు?
    ఎవడు సూర్యచంద్రాదుల
    ప్రవిమలముగ ప్రకాశించు?
దృష్టి నిచ్చు నెవడు? తనదు
సృష్టి చూచి పులకింపగ?
    శ్రవణద్వయ మెవ డొసంగె
    కవనగాన మాలకింప?
నిశిత మేధతో పాటుగ
విశదహృదయ మెవ డమర్చె?
    ఎవడద్భుత రసన నిచ్చె
    వివిధ రసాస్వాదనకై?
మంచి దేహ మెవని భిక్ష
అంచిత పూజాచరణకు?

జానుగ సంకీర్తింపగ
పాణిపాద కంఠ మొసగె?
    పరితపించు నెవడు సదా
    పరిపరి విధముల మనకై?
ఎవడు తల్లి? తండ్రి యెవడు?
ఎవ డత్యం తాత్మీయుడు?
    ఆత డెవడొ నే నెరుంగ
    ఆతని జాడలు కన్పడు.
ఆతడె మన కేడుగడగ
ఆతత సంరక్షకుండు.
    ఆతడే మన రథసారథి
    ఆతడే మన మహాకాంక్ష.
ఆతడు లేక మన బ్రతుకులు
అతి నీరసమై నశించు.
    ఆతని గూర్చి పాడుకొనుటె
    అతులిత సమ్మోద మహిమ.
ఆతని తోడ ఆడుకొనగ
ప్రతి జీవికి మహోత్కంఠ.
    ఆత డెవడు? మన కన్నయ
    ఆతత చైతన్యప్రభువు.
తలపగానె యతని పేరు
పులకిత మాపాద శిరము.
    పరవశించిపోవు మనసు
    పరిమళించు నవనాడులు
సకలేంద్రియ సంతర్పణ
సుకర మతని సంస్మృతిచే.
    నిఖిల రసామృతమూర్తికి
    సకలము నర్పించుకొనిన
సార్థకమ్ము మన జన్మలు
వర్ధిల్లును మన సుకృతము.

"శ్రీ గౌరాంగ" - ఫిబ్రవరి 1996

# అంకితం

అ క్క య్య
కొ్రాా వసుమతికి

* * * * * *

గంగ లోని తరంగములుగా
పొంగు కష్ట పరంపరలలో
క్రుంగి జీవిత దీర్ఘకాలము
అంగలార్చిన దక్క వసుమతి.

పాదుకొనె కష్టాలు తన కని
వాదులాడిన లాభ మేమిటి?
దైవకృపయే సర్వమను సం
భావనము చేకూర్చుకొన్నది.

కష్ట నిష్ఠురములకు నోర్చుచు
తుష్టిగా భోజనము పెట్టెడి
దతిథి కభ్యాగతుల కి వసు
మతియె యని పేరందె నగ్రజ.

అర్థమునకై త్రిప్పలైనా
తీర్థయాత్రలు చేసినది, ఆ
సేతు శీత నగోర్వి విధిగా
చేత ముత్సాహమ్ము చెలగగ.

అప్పుచేసిన మాత్ర నేమగు?
పప్పుకూడు భుజింపవలె నను
ధర్మమును శిరసావహించెను
కర్మ సిద్ధాం తానుగుణముగ.

తనకు బిడ్డలు లేని కొరతను
మనసునకు రానీక పాడును
లాలి పాటలు, మేలు కొలుపులు
బాలకృష్ణుని లీల లార్తిని.

భాగవత పారాయణముతో
భాగవత సంసేవనముతో
భాగధేయమునే స్మరించుచు
సాగె నీయమ బ్రదుక దెట్లో.

అతుల శ్రీకృష్ణాష్టమీ వ్రత
మతి విశిష్టముగా నొనర్చెను
మధుర మధుర పదార్థ వితతిని
మధురపతికి నివేదనం బిడి.

అర్థలోపము ధిక్కరించుచు
అర్ధశత వర్షములు, అష్టమి
వ్రతము నిష్ఠగ నిర్వహించి, ర
జిత ప్రతిమను దాన మిచ్చెను.

లక్షవత్తుల నోము దీర్చిన
దక్షురాలని పేరుగాంచెను;
పంచవర్ష ప్రణాళికలు గా
వించుచూ జీవితము నెట్టెను.

రామనామ క్షేత్రమున శ్రీ
రామకోటికి పడగలెత్తెను;
రామకోటి మహోత్సవము లవి
రావుముగ దర్శించె వసుమతి.

పెక్కు నామ సహస్రములనే
చక్కగా వల్లించు నేర్పరి;
ఉపనిషత్తులు శుచిగ విన్నా
ఉపాసించు ననేక మూర్త్తుల.

ద్వైతముగ జీవించుచూ అ
ద్వైత వాదన నిర్వహించును;
దేహ తాదాత్మ్యమ్ము చెందుచు
మోహపడు పరమాత్మ, ఆత్మని.

ఆత్మ జాడ నెఱుంగకే పర
మాత్మ ఆత్మని లాభ మేమిటి?
ఆత్మ తానను నిశ్చయ జ్ఞా
నాత్ము లెక్కడో కోటి కొక్కరు.

పక్షవాతపు వాతబడినా
లక్షణమ్ముగ కోలుకొన్నది;
దృష్టిమాంద్యము వాపుకొన్న అ
దృష్ట, నారాయణుని కరుణను.

రోగములు పైబడ్డ కొలదిని
త్యాగజాలక కోరె దేవుని;
"పడితి నాజీవితము దైన్యము
ఇదుము మరణం బనాయాసము."

మైల కూడు భుజింపనీయక
కాలు డామెను కనికరించెను;
ధన్యురా లీ వసుమతమ్మని
మాన్యు లీమెను ప్రశంసించిరి.

లేని యోపిక తెచ్చుకొనగా
నేనె కర్మాదిక మొనర్చితి;
తీర్చితిని సాంవత్సరికములు
కూర్చితిని ముత్యాలసరములు.

బ్రదికి నప్పుడు లేని శ్రద్ధను
బ్రదుకు చాలింపగా చూపుట
శ్రాద్ధ కర్మలటంచు మిగుల ప్ర
సిద్ధ మీ హైందవ మతమ్మున.

ఇట్టి హృదయోల్లాస కావ్యము
అట్టి ధన్యకు సమర్పించెద;
ఆ యశోదాదేవి యశములు
ఈయమకు దక్కంగవలె నని.

బ్రతికి నప్పు డొసంగ నైతిని
కృతిని సోదరి కోర్కె తీరగ;
ఆమె మెచ్చిన దైవకృతి యిది
ఆమె కంకిత మిత్తు గుర్తుగ.

తొలుత రాసిన గీతికలు విని
నిలిపె మది శ్రీకృష్ణ కృతిపై;
సంతు లేదను మనస్తాపము
సుంత యుపశమనమ్ము చెందగ.

పుట్టదా ఏ భాగ్యవంతుల
పట్టిగా నీపాటి కగ్రజ?
తీర్చుకొనదా మనోఽభీప్సలు?
అర్చనలు వ్యర్థమ్ము లగునా?

మక్కువగ 'హృదయోల్లాసము'
అక్క వసుమతి కంకితము గా
వింతు సంతత కృష్ణ భగవ
చ్చింత నామృత పాన చిత్తకు.

మహిత శ్రీకృష్ణాష్టమీ వ్రత
నిహిత నియమాచరణ దీక్షకు
అక్క వసుమతి కంకితముగా
నొక్కి వక్కాణింతు నీ కృతి.

మాత లలితా సహస్రాధిక
పూత నామావళి సమస్తము
రసన కొన నర్తించు నగ్రజ
వసుమతికి నంకితం బీ కృతి.

ఉపనిష ద్గీతాది శాస్త్రము
లుపస్థితమ్మై యున్న సోదరి
కరులి తాద్వైతానుమతి వసు
మతికి నంకిత మిత్తు నీ కృతి.

భావనారాయణ స్వామిని
సేవలన్ సంతృప్తి పరచిన
భక్తిమతి శ్రీవసుమతికి నను
రక్తి నంకితమిత్తు నీ కృతి.

వివిధ విధి సత్కర్మ నిష్ఫల
అవితథము తుదిదాక నెరపిన
నిరత భక్త్యుత్సాహమతి కి
సరస కృతినిడి సుకృతి నయ్యెద.

వ్యాసభగవంతుండు, పోతన
చేసి రీభాగవత సృష్టిని
సంస్కృతాంధ్రములందు, జనముల
సంస్కరింప రసోచితముగా.

అందులో సూక్ష్మాంశ మొక్కటి
అందె నా మది భావ విస్తృతి;
సుందరముగా సత్యమే పెం
పొందె పల్లవి గీతములుగా.

'సుప్రభాతం' బనెడి ప్రక్రియ
సుప్రసిద్ధము, భక్తి సాహితి;
బాలకృష్ణుని 'విశ్వనాథుడు'
మేలుకొలుపె నపూర్వ ఫణితిని.

"లెమ్ము కృష్ణా! వేగమే లే
లెమ్ము నీ దీసుప్రభాతము"
అని రచించితి మేలుకొలుపులు
మునుపు నేను యశోదసతినై.

ఇప్పుడిక గోపికా భావన
కప్పగింపగ మనోవృత్తిని
వల్లవీ సల్లాప సరసులు
అల్లుకొనె నుప్పొంగ నుల్లము.

పోతనార్యుని పద్యతతి నా
చేతమును నుత్తేజ పరుపగ
ఏతదద్భుత శిశువుపై ను
ద్భూత మీ సల్లాప కావ్యము.

బాలపరమేశ్వరుని గాంచెడి
లాలసను శ్రీ గోపకాంతలు
పలికి రాక్కరి కొక్కరీగతి
వలపు చిందెడి తలపు లెన్నో.

అద్భుతపు శిశు దర్శనముచే
ఉద్భవించిన మహానందో
త్సాహ మతులగు గోపికాతతి
ఊహ లీ ముత్యాల సరములు.

గోపికా హృదయోల్లాసపు
తీపి రుచి చూపించు యత్నము
నోపినంత కొనర్చితిని, నన్
బ్రైపుడీ! శ్రీకృష్ణ భక్తులు.

గోపికలతో సాటి రాగల
గోపికంపై మేటి యనదగు
ప్రేమ తీవ్రోత్కంఠ భక్తులు
ఆ మహాత్మికి లేరికెవ్వరు.

* * * * *

# సందర్శనం

అద్భుతంబగు వార్త - శిశువది
యుద్భవించెనటే! యశోదకు;
నవ్వుకొంటిమి నాపచేనని
ఇవ్విధాన ఫలించె నౌరా!!

గోపురెల్లను రాత్రి యంభా
రావములు గావించె వేడుక;
భువికి దిగె నే యపూర్వాద్భుత
దివిజ లోకాతీత చేతన ?

తరలి రండో! సుదతులారా!
అరయు తల్లిని, పున్నజన్మను;
చూచమే యా బిడ్డ యెవరో!
చేతముం నుప్పొంగజేయునో ?

ఏం చేసెద రింత తడ విప్పు ?
డేల మీకీ యలంకారము ?
లెవరి మెప్పుకు వంపుకే యా
వివిధ శృంగారాతిశయములు ?

ఇపుడు పుట్టిన శిశువుపై మీ
కపుడె యింతటి ప్రేమ డేటికి ?
ఎదిగి నప్పుడు క్రుమ్మరింపుడి
ఎదల గల రాగాబ్ధి మణులను!!

వచ్చు నెన్నో సమయములు, ఈ
వచ్చు కానుక లనేకమ్ములు;
ఇపుడు త్వరగా చూచి వత్తము
అపుడె బారెడు ప్రొద్దు పైబడె.

అంత దనుకను నోపజాలక
నుంత సింగారించుకొంటిమి;
పట్టి జూడగ పోవునప్పుడు
వట్టి చేతుల నేగ దగునే ?

పెండ్లి నడకల జాగు సేయకు
డింట్ల కిప్పుడె తిరిగి రావలె;
ఊరకే మన యత్తమామలు
నేరములు మోపంగ జాణలు.

ఒక్క పనికే నుపకరింపరు
మెక్కి నీలిగి కూరుచుందురు;
ఎక్కడెక్కడి వావి వరుసలు
చక్కబెట్టెడి పుణ్యమూర్తులు.

* * * * *

వింటిరే! లోచెవిని నెమ్మది
మింట వంశీవేద నాదము ?
నింగి నంతయు నావృతం బు
త్తుంగ కాంతి ఛ్ఛటలు కంటిరె!!

మెల్ల మెల్లగ పిల్ల గాలులు
ఉల్లముల నుయ్యాల లూపును;
పూల పగిదిని వాన చినుకులు
రాలు, సకలము శుభోదర్కము.

మింట నదుగో! గరుత్మంతుడు
ఇంటిపై తిరుగాడు చుండెను
మహోల్లాసముగా ధ్వనించుచు;
మహానంద పవిత్ర గృహ మదె.

పలుకు రుచిరాగతము, పుంస్కో
కిలము లవి సహకార శాఖల;
నెమిలి గము లవె పురులు విప్పుచు
క్రమముగా నర్తించు ముంగిట.

'రామ! రామా!!' యనెడి కోకిల
లేమి యాలాపించు నికపై ?
'కృష్ణ! కృష్ణా!!' యనుచు రక్తిని
విష్ణు సంకీర్తనము సల్పునొ ?

పొన్న పొగడల చెట్లపై కూ
ర్చున్న వవిగో! ద్విజము లెన్నో!!
క్రొత్త గీతాల్ పాడగా గొం
తెత్తి యుత్సాహించుచున్నవి.

కడు పచేళిమ చూత ఫలముల
బొదుచు నదె శుక వితతి చూడరె!
శుక ముఖామృత రసము గ్రోలంగ
ప్రకృష్టోత్కంఠితులు రసికులు.

పద్మ సంతతి యశోదాంగన
సద్మమున శిశురూపు దాల్చిన
కారణముననొ ? భ్రమర తతి ఝుం
కారములతో నిల్చె వాకిట!!

నంద గృహ మానస సరస్సును
జెందె గగనము నుండి హంసలు;
నంద గృహ మిది కాదు, సకలా
నంద ప్రకృతికి సుందరాకృతి.

వాద్యములు ఘోషించుచున్నవి
హృద్య భావ సమైక్య రీతులు;
జనము నంద ప్రశంసకై ప్రాం
గణమునన్ క్రిక్కిరిసి చేరెను.

అరుగుదురు యువ గోపు లరుగో
పెరుగు దుత్తలు, పాల కడవలు
సరస గొని, తగ వరస లాడుచు
నెరపగా నవ వసంతాలను.

సకల జగదానంద మిక్కడి
ప్రకృతిలో లాస్యములు సేయును;
జనన మందిన దాది ప్రజమున
కనము విన మీరీతి సందడి!!

* * * * *

అద్భుతము - మగబిడ్డడే! యిత
డుద్భవించెను, మన యశోదకు;
సుందరోజ్జ్వల నీలమణి మన
కందె యనురాగములు చిందుచు.

ఇమ్మహాద్భుత బాలు డీగతి
ఇమ్మహాస్థలిపై జనింపగ
ఎంత తీవ్ర ప్రసవ వేదన
ఇంతి కనుభవ మైనదో గద!!

వేదనము లేనిదే స్త్రీలకు
లేదు చరితార్థమ్ము సుదతీ!!
అపనయింపగ చూడ రాదా
తపన, తప్పదు రాణికైనను.

కన్నదే మన యశోదా సతి
చెన్నుగల మగ చిన్ని బిడ్డను;
కన్న కనవలె నిట్టి కన్నను
ఎన్ని జన్మము లెత్తియైనా.

ఎవరు పోసిరొ పురుడు తల్లికి ?
ఎవరి హస్త ప్రశస్తియో! యిది ?
ఆదిశక్తియె వచ్చెనేమో
దాదిగా నీ యశోదమ్మకు ?

ఆడపిల్లే పుట్టునని మన
మాడుకొంటిమి నిన్న మొన్ననొ!!
ఇంతలో నెట్లాడిపడెనో ?
వింతగా మగబిడ్డ డీగతి!!

గర్భమది పదినెలలు చన నా
విర్భవించును ఉవిదయే యని
పెద్దలాడెడి సుద్ది యిట్లు వి
రుద్ధమాయె నిదేమి మాయయొ ?

మారు మాటుగ నెవరి బిడ్డో
చేరెనేమో విచారింపుడి!
అప్పుడప్పుడు జరుగు నిట్టివి
చెప్పలేమే విధి విలాసము!!

నోటి దురుసున పల్కకే ఈ
లాటి మాటలు, విన నసహ్యము;
ఆలకింపదులే యశోదని
ప్రేలకే నీ నోరు నొవ్వగ.

బోటులకు నువుగింజ నానదు
నోట నను నానుడికి ఈ నీ
మాటలే తగు నిదర్శనమా!
ఏటి కీ వ్యర్థ ప్రలాపము ?

గోడలకు చెవులుండు, నీ వి
ట్లాడు మాటలు నిరాధారము;
కూడదే పిన కిం పదంతులు;
వీడు మనకై యవతరించెను.

ఒక్క చిన్నియ దక్క, తక్కిన
వెక్కుడుగ పరికింప నాడువె!
ఏల మారెనొ బ్రహ్మ మన సీ
లీల మగవానిగా జేసెను ?

ఆడు చిన్నియ యున్నవాడే
ఆడుకొనునే యాడు జనముల;
ఆడు మగ భేదా తెరింగెడి
ప్రోడ గాబో డీకుమారుడు.

ఆడు పోలిక లెక్కువగు మగ
వాడె మన కతిప్రీతిపాత్రుడు;
ఇతనితో క్రీడించుటే మన
కతివలారా! భావి భాగ్యము.

బ్రహ్మ కరుణామయుడు, మన కీ
బొమ్మ నిట్లాధార మొసగెను;
పరమ చైతన్యాకృతీతడు
కొరతలే లేకుండ జేయును.

రాత్రి పుట్టిన బిడ్డ కింతటి
గాత్ర మొదవుట యబ్బురము గద!
అంతుపట్టని మాయ, యీ వృ
త్తాంత మంతట నలము కొనెనో!!

మాయ గీయను మాట లేటికి ?
మాయ బ్రహ్మని చోటు గలదే ?
మాయగా జీవించి క్రమముగ
మాయగానే మాయమౌదుము.

క్షణ క్షణమును గల్గు మార్పులు
గనుడి సూక్ష్మేక్షికను శిశువున;
వామనున కితడేమి యగునో ?
భూమి గగనము నాక్రమించునొ!!

మాట లప్పుడె ఆలకించును
బోటులారా! పలుకరింపుడి;
చూపుడీ మీ జాణతనమును
పాపడని సంకోచపడకుడి.

బాలకుని దర్శించు మాత్రన
లీలగా విస్ఫూర్తి గాంచును
మన్మనో విస్మృతిని జెందిన
జన్మ జన్మల వాసనా తతి.

పూర్వ జన్మల వాసనల్ మది
పర్వ వచ్చును; వింత గాదిది;
బాలకుడు గాపింప నేర్చిన
లీలలే దర్శించు నా మది.

చిన్ని మగవానినే యిచ్చిన
సన్నుతాంగిని మన యశోదను
పోల్చదగు కౌసల్యతోనో!
నిల్పదగునో! యదితి ప్రక్కనె!!

మహాసౌభాగ్యమ్మె మనదే!
మహానంద మనంగ మనదే!!
మహోదాత్తుని గాంచినారము
మహానందాంగనా డింభకు.

కాడు పిల్లడు - పిడుగు చిచ్చర!
కాడు గొల్లడు - గోవిందుండే!!
కాడు పాపడు - పాప పానుపు!
కాడు కేవల నరుడు - శ్రీహరి!!

కృష్ణ పక్షము, అర్ధరాత్రిని
కృష్ణు డష్టమి నవతరించెను;
విష్ణుమూర్తికి మారు రూపై
తృష్ణ దీర్చు ముముక్షు కోటికి.

ఇతడు విశ్వాకర్షకుండగు
కతమునను శ్రీకృష్ణు డందము;
ఎన్ని నామము లితని కగునో
అన్నిటిని సార్థక మొనర్చును.

సర్వ పాపధ్వంసి యీతడు
సర్వ దోషవిదూరు డీతడు
పరగు సత్యానందమయమౌ
పరబ్రహ్మము నీత డనగా!!

ప్రకృతి యీతడు, పురుషు డీతడు
సకల భూతశరీరు డీతడు;
సర్వ శక్తియుతుండు, కాలము
సర్వమయుడు, ననశ్వరుండగు.

కృష్ణుడే యని కాదె, యితనిని
'కృష్ణమా!' యని పిల్చుకొందము;
'అమ్మ!' యను ప్రేమార్ద్ర వాచక
మిమ్మగా సరిపోవు చేర్చగ!!

సహస్రాధిక నామములతో
అహరహము పూజార్హు డీతడు;
ఇహ పరమ్ములు వీని వలననె
బహుముఖాల ఫలించు నికపై.

జనన తిథి నక్షత్ర వారము
లనుపుపడ దైవజ్ఞ మౌళులు
నిర్ణయమ్ముల నే మొనర్తురొ ?
దుర్నిమిత్తము లేమి కలుగునొ ?

నిసిని బుట్టిన శిశువు గావున
నిశాచరులను రూపుమాపునొ ?
ఆహవించిన అవని పతినే
ఊహకందని రీతి చంపునొ ?

ఎవరి పోలిక లితని కేర్పడె ?
ఎవరు నిర్ణయవేత్త లిత్తరి ?
ఇతని పోలిక లన్ని యితనివె
ఇతని కితడె సాటి, మేటియు.

ఇతని జన్మము కతమునను మన
బ్రతుకులకు నవ వసంతాలే!
మోడువారిన జీవితాలకు
పోదుములు పొడసట్టగలవే!!

ఎన్ని లీల లొనర్చు నీ ఘను ?
డెన్ని మాయలు చేసి చూపునొ ?
అన్నిటిని దర్శింప మన కి
కన్ను లేగతి రెందు చాలును ?

సార హీనములైన మన సం
సారముల కిక సార మొదవును;
సారసాకారుండు కరుణా
సారమును వర్షించు మనపై.

నెమిలి పింఛము తలకు కట్టుడు
క్రిములు, పాములు తిరుగ విచ్చుట;
దుష్ట గ్రహముల నిగ్రహింపగ
శ్రేష్ఠమగు తాయెతుల్ చుట్టుడి.

మొరటు తాయెత్తులను గట్టిన
బరువు మోయగలాడె పిల్లడు ?
తులసి దళముల మాలగట్టుడి
గళము సుభగాలంకృతం బగు.

తులసి మొక్కలు పెంచుడీ! కా
వలసినన్ని దళాలు దొరకును;
పూలకన్నను తులసి దళముం
మాలకే గుణ మధిక మందురు.

తులసి మొక్కలు పెద్దవగుచో
తులసి పూసల మాల లేర్పడు;
అపుడు మనపై వార్ధకము పడ
జప మొనర్పగ నుపకరించును.

ఇతని గళమున తులసి సంశో
భితము గావున 'కృష్ణతుల'సగు;
వేరు తులసికి 'లక్ష్మితుల'సను
పేరు ప్రఖ్యాతులు లభించును.

తులసి దళమున కమిత మహిమము
కలుగు నీతని గళాసక్తిని;
మిన్నగా తులతూగు బంగరు
కన్న తులసికె యీ మహాత్మ్యము.

తులసి దళము ప్రసాదముగ గొన
కలుగు రక్త విశుద్ధి వేగమె;
తులసి తీర్థము పుచ్చుకొనగా
తొలగు ప్రాణము తిరిగి చేకురు.

వ్రజమునకు 'బృందావన'మ్మను
ప్రజా వ్యవహారమ్ము కల్గును;
గోప గోపీ బృందమున కిది
ప్రాపుగా 'బృందావనం' బగు.

సరస్సులలో నెత్తి కలువలు
విరివిగా వికసించు, తెండిటు;
దండకట్టి యలంకరింతము
నిండుగా మన నల్లనయ్యను.

పొగడ పూవులు దండ గ్రుచ్చుడి
మిగులుగా వాసించు నయ్యవి;
పొన్నపూవుల కేమి తక్కువ ?
మిన్నగా తోరణాల్ గట్టుడి.

పాల కడలిని వీడి వెన్నుడు
పూలకై యీ భువిని జేరెనె ?
దివిని గల మేల్ పూల చెట్లను
భువిని నాటునొ యీ ప్రబుద్ధుడు ?

దివిని మించిన దన్ని విధముల
భువియె యని తా నిరూపించునొ ?
పాల కడ లిట సృష్టి సేయుగ
పాల కడవలు పసులగొట్టునొ ?

కట్టుడీ మీ నేర్పు కొలదిని
పట్టు దట్టీల్ పట్టె కోసము;
ముప్వ గజ్జెలు, పైడి మొలనూల్
నిప్పటిల్లిక యశోదాజ్ఞను.

తిలకమును ఫాలమున దిద్దగ
వలయు, కస్తురి సేకరింపుడి;
శుభముగా వక్షఃస్థలము కౌ
స్తుభముతో శోభింపజేయుడి.

కరము మెల్లన చాపుచుండెను
మురళి తెమ్మను సూచనేమో!!
పురుటి శుద్ధికి పిదప సర్వా
భరణములు సమకూర్ప దగునే!!

మురళి గొని ప్రాణానిలమ్మును
బొరింబొరి పూరించి మనలను
దరికి జేర్చుకొనంగ జాలిన
పరమ మాయోపేతు డీతడు.

హారకుండల భూషణావళి
తోరముగ జేయించు లోపల
రకరకమ్ముల పూల మాలలు
ప్రకటితాలంకృతు లొనర్తము.

పూల పూజలు విగ్రహాలకు
ఏలనే చైతన్యమూర్తికి ?
మెత్త మెత్తని మన యెడందలు
పొత్తికలు కావించు టుచితము.

ఇచ్చుమెయి బల్ మంచి మంచివి
గ్రుచ్చుడీ ముత్యాల సరములు;
నలుపుపై తెలుపెట్లు పొసగునొ
కలయ జూతము కనుల కింపుగ.

ఇతని పుట్టుక పాడి పంటలు
అతులితమ్ముగ వృద్ధి గాంచును;
ఇతని కవి నైవేద్య మొసగిన
కతమునను మన కబ్బు ధన్యత.

అన్ని భాగ్యము లిట్టు లేర్పడ
సన్నుతాంగికి నందపత్నికి
దశదిశా పరిరంభమౌ ఘన
యశము చేకురు నిక యశోదకు.

ఎట్టి గాఢ తపః ఫలంబో!
ఇట్టి లోకోత్తర కుమారుని
పడసెనే మన యశోదాసతి
పడతు లంద రసూయపడగా.

ఎందుకో కుడికాలు నీగతి
ముందు ముందుకు లాగుచుండెను ?
అందవేయు ప్రయత్నమే యిది
సుంద రాంగుష్ఠమ్ము నోటికి!

మట్టియాకున పవ్వళింపగ
కుట్టనికి ఆహ్లాదమేమో ?
నోటి కందెను బొటనవ్రేలిక
బోటి! తే, వటపత్రమును వే.

చెప్పు వాల్చిక చూచు నట్లే
చెప్ప మిత దనిపిస్తుందేమో ?
చప్పరించుచు నుండె నోటను
చిప్పిలునొ! యమృతంపు బిందులు ?

వాడి చూపులతో ముఖాలను
గాఢముగ పరికించుచున్నా
డితని కెవ్వతె ప్రియతమంబో ?
అతులగతి ఆరాధనీయము ?

ఇంతలేడీ బాలకుడు, కన
నెంత నిశితం బితని చూడ్కులు ?
చూపులో ప్రేమాబ్ధు లింకును!
ఏపుగా తత్త్వాబ్ధు లుబుకును!!

చూపులివి భాషింపగలవే!
చూపులివి బోధింపగలవే!!
చూపులివి రమియింపగలవే!
చూపులివి దమియింపగలవే!!

ఎందుకే యీ సుందరాంగుడు
మందహాసము చిందు మనపై ?
కూపగత మండూకముల గన
పాపనికి పరిహాస మేమో ?

బాలకుని వీక్షించు కొలదిని
ఏల యీ పులకాంకురమ్ములు ?
పూర్వ జన్మ స్మృతి విభూతులు
పర్వి యెద నుప్పొంగ జేయునొ ?

ఇతడు మన్మథ మథను డగునే ?
ఇతడు నారీ జనాకర్షకు
డితడు పులకిత ప్రకృతి గాత్రుడొ ?
ఇతడు సుందర సత్య శివుడో ?

ఇతని దరహాసములు గ్రోలగ
మతులు కల్మషరహిత మగునే ?
ఇతని ప్రేమామృతము జుర్రగ
వ్రతా చరణ మవశ్య మగునే ?

ఇతడు మన కరచేతి యుసిరిక
ఇతడు మన ముంగొంగు బంగర
మితడు మన ముంజేతి కంకణ
మితడు మన సర్వోపహారము.

ఇత డనంతశ్రీ, మహోర్జుడు,
ఇత డనీశుడు, అనంతాత్ముడు,
ఇత డమోహుం డసంఖ్యేయుం
డిత డశోకుడు, సుస్మితశ్రీ.

ఈత డరవిందాక్షు డర్ఘ్యుడు
ఈత డేకుం డేకపాదుడు
ఈత డప్రతిరథు డఖండుడు
ఈత డమృతుం డాదిదేవుడు.

ఈత డచ్యుతు డచలు డజితుడు,
ఈత డనలుడు, అనిర్విణ్ణుడు,
ఈత డనిలుం డణువు, శాంతుడు
ఈత డక్షరు డనఘు డనయుడు.

ఈత డుగ్రు డుదీర్ణు డూర్జితు
డూర్ధ్వగుం డుత్తముడు, భానుడు
ఇత డుపేంద్రుడు, ప్రసన్నాత్ముడు,
ఇత డభిప్రాయుండు, ఇష్టుడు.

ఇతడు కపిలుడు, కవీంద్రుండును
ఇతడు కవి, కారణుడు, కాలము,
ఇతడు కుముదుడు, కృతజ్ఞుండును,
ఇతడు క్షేత్రజ్ఞుండు, గుప్తుడు.

ఇతడు గహనుడు, గురుడు, గోహితు
డితడు జనుడు, జయుడు, జీవుడు
ఇతడు జ్యేష్ఠుడు, దుర్లభుండును
ఇతడు ధర్మ్యుడు, ధర్మి, ధన్యుడు.

ఇతడు నిష్ఠుడు, నేత, నేయుడు
ఇతడు పవనుడు, పురాతనుడగు;
ఇతడు పురుషోత్తముడు, పూర్ణుడు,
ఇతడు పురంజితు, ప్రకాశాత్ముడు.

ఇతడు ప్రణవుడు, ప్రభువు, ప్రభవము
ఇతడు బ్రాహ్మియు, బ్రాహ్మణుండును,
ఇతడు భీముడు, మహాభాగుడు,
ఇతడు యోగీశుండు, యోగము.

నిత్య ముక్తుడు, నిర్వికారుడు,
నిత్య శుద్ధుడు, నిష్ప్రపంచుడు,
నిత్య తృప్తుడు, నిరాబాధుడు,
మృత్యు మథనుడు, సంశయఘ్నుడు.

మహామంత్రుడు, మహాతంత్రుడు,
మహాయంత్రుడు, మహాసనుడును,
మహాయాగ క్రమారాధ్యుడు
మహాభైరవ పూజితుండగు.

ఇతడె యగు లావణ్య శేవధి
ఇతడె పో రసశేవధియు నన;
ఈతడే రాకేందు వదనుడు
ఈతడే రాజీవ నేత్రుడు.

అన్ని నామము లితనివే, వే
రెన్ని నామము లితని కేర్పడు;
ఎన్ని పేర్లేర్పడ్డ నేమగు ?
కన్న డన్ననె తృప్తి జిహ్వకు.

పెక్కు నామములన్ కుమారుని.
నొక్కి వక్కాణింతు రేటికి ?
మక్కువేలకొ శబ్దములపై
నిక్కమర్థ మెరుంగ నప్పుడు ?

ఒక్క నామము నుచ్చరించిన
చక్కబడు నీరసపు బ్రతుకులు;
కృష్ణ! కృష్ణా!! యన్న క్షణమున
తృష్ణ తీరు, ననేక జన్మల.

హాయిగా శ్రీకృష్ణ గానము
సేయుచును సత్కృతు లొనర్చిన
భారమే యనిపించ దీసం
సార మతి సౌఖ్యావహం బగు.

అంచదండగ నుండు శ్రీకృ
ష్ణుండు మేరువుకొండ రీతిగ;
ఎండబారిన కొమ్మలకు వే
పండు నవచైతన్య ఫలములు.

"హరే కృష్ణా! హరే కృష్ణా!!
హరిహరీ! శ్రీకృష్ణ! కృష్ణా!!"
అన్న చాలది మహామన్త్రము
కన్న మిన్న; తరింపజేయును.

పలుకు మొదటను 'కృష్ణ' యనుడీ
పలుకు తుద 'శ్రీకృష్ణ' యనుడీ
పనికి ముందర 'కృష్ణ' యనుడీ
పనికి తుద 'శ్రీకృష్ణ' యనుడీ.

'కృష్ణ' యను రెండక్షరము లు
త్కృష్ణమైనవి సకల సృష్టికి;
తలచి తలచి జపింపు డతనిని
వలచి వలచి తపింపు డతనికి.

మనము వీని జపింప నే మగు ?
మనల నితడు తలంప వలదే ?
ఒక్క వైపున ప్రేమ నెలకొన
చక్కగా రస ముప్పతిల్లునె ?

ఇతని ప్రేమించుటే మన పని
ఇతని కామించుటే యుచితము;
బదులు కోరదు ప్రేమ నిర్మల
మెదుర్కొను నడ్డంకు లన్నిటి.

వ్యాజ మైత్రిని నెరపు పూర్వపు
రాజు కాబో డీ మహాత్ముడు;
సకల జీవాత్మలను స్వాంశగ
ప్రకటపరచు సనాతనుండే!!

పడయు నీతని గాలి సోకిన
జడము లన్ని వినూత్న ప్రాణము;
కడకు జంతు విహంగ సంతతి
కడగి యరచును 'కృష్ణ' 'కృష్ణ'ని.

మురళి చేకొని యీత డూదిన
పరవశించును ప్రకృతి సర్వము;
వృక్షశాఖల మీద, క్రిందను
పక్షి మృగములు పులకరించును.

తాండ వోద్భట లాస్యములతో
నిండె ముజ్జగము, లికపై
రాసలీలా నృత్త పద వి
న్యాస పులకిత గాత్ర, వసుమతి.

యమము, నియమము, విధి, నిషేధము
క్రమము తప్పని యోగి పుంగవు
లందుకొన దుస్సాధమౌ ఆ
నంద మిక మన కందగుందే!!

ఇతడె మన కారాధ్య దైవము
ఇతడె మన కాలోచనీయుడు
ఇతడె మన కానందదాయకు
డితడె మన ప్రాణానిలమ్మన.

ఇతని సన్నిధి మనకు పెన్నిధి
ఇతని వాక్కులు రుచిర బుక్కులు
ఇతని నడలే మనకు మనుగడ
ఇతని గాథలె పురాణావళి.

ఇతని సామీప్యమున నిల్వుడి
ఇతనితో సాలోక్య మందుడి
ఇతని సాయుజ్యమును బొందుడి
ఇతనితో తాదాత్మ్య మందుడి.

ఈతడే మన తోడు నీడై
ఆతతానందమును గూర్చును;
చేతములు నవ నవోల్లసితము
పూతములునై ప్రవర్ధిల్లును.

ఇతని లీలలు కన్న జనులకు
బ్రతుకులో మాధుర్య మలవడు;
ఇతని బోధలు విన్న జనులకు
బ్రతుకు కళ కీలకము తెలియును.

ఇతని నామ స్మరణ మాత్రన
జితుండగు మన్మథుడు సైతము;
ఇతని గుణ సంకీర్తనము స
ద్గతి సుమా! కైవల్య సిద్ధికి.

కోటి మన్మథ రూపుడే; శత
కోటి సూర్యప్రభాకరుడే !!
నరుల జీవిత రథములకు శ్రీ
కరుడు సారథ్యము వహించును.

తనదు సర్వేచ్ఛా విభూతిని
తనదు జ్ఞానానంద మహిమను
తనదు సకల క్రియాసక్తిని
మనకు పంచు వదాన్యు డీతడు.

ఈ మహాద్భుత శిశువు దర్శన
మే మహోన్నత తపః ఫలమో!
ఈ మహా చాక్షుష క్రతువును
ఏ మహాత్ములు, మును లొనర్చిరె?

ద్వాపరము శిశు పితడని మీ
గోపకుడి చింతింప మదిలో;
గోలోకపు నిత్యకృష్ణుడె
భూలోక నివాసి యాయెను.

ప్రకృతి మాతకు ముద్దు బిడ్డని
సకల లక్షణ లక్షితుని, సుతు
కన్న కతమున మన యశోదకు
మిన్నగా నెన రుంచవలెనే.

ఎంత సత్యం బెంత శివమో!
ఎంత సుందర శిశువో! కాంచుడి!!
ఏ మహాచైతన్య వాహిని
ఈ మహీస్థలి కవతరించెనో ?

ప్రకృతి యెంతటి తప మొనర్చెనో ?
సుకృతి యీ శిశు వవతరింపగ!
ఏ యుమో ఘూకాంక్ష ఫలమో
ఈ యపూర్వానర్ఘ మణి గన!!

ఇతడు విష్ణువు, బ్రహ్మ యితడే!
ఇతడు శివుడన; ఇంద్రు డీతడె!!
ఇతనికే మన యెల్ల పూజలు
ప్రతఫలా లర్పింపవలెనే!!

నాల్గు మోములు లేని నలువయె!
కల్గు చేతులు రెండు, వెన్నుడె!!
కన్ను నొసటను దాచు శివుడే!
కన్న యందరి కన్న మిన్నే!!

చతుర్విథ పురుషార్థ సాధన
మతుల నిక పరమార్థ పదవికి
ప్రేమ భక్తిని పంచునే యీ
సామగాన రసార్ద్ర హృదయుడు.

మందహాసము చిందులాడు ప
సందు పాపని ముద్దు గొనరే ?
గుత్తగొనె సౌందర్య మీతడె!
యెత్తిపోతల యితని ప్రేమము.

ఎందుకే యీ రెండు కన్నులు ?
సుందరాంగుని చూచు కొరకే!
తీరదే యొడలంత కన్నుల
పార జూచిన నేత్ర దాహము.

ఎందుకే ఈ రెండు పెదవులు ?
నందనుని ముద్దాడు కొరకే!
ఎందుకే యీ రెండు బాహులు ?
నందనుని బంధించు కొరకే!!

పూర్వ జన్మములం దొనర్చు న
పూర్వ పుణ్యఫలంబు దక్కెను;
ఇట్టి చిన్ని కుమారు గాంచిరె
యెట్టి స్త్రీ లీరేడు జగముల ?

రేక రేక జనించె బంగరు
సోకుగాడు సుతుండు తనకని
సోకునిక మన యశోదాంగన
వాకులో గరువంపు రేఖలు.

పువ్వు పుట్టగ పరిమళించును
నవ్వు లెగయగ కలయ జిమ్మును;
పట్టలేమే రెండు చేతుల
పట్టి నిదె! చేపట్టి యెత్తుదు.

త్రాళు ఛాయల పాతవడ్డవి
బాలకుని మోయంగ జాలవు;
మన మనస్సను ఊయలను, కా
మన యనే పాశముల గట్టుడి.

పాదములలో శంఖ చక్ర గ
దాది ముద్రలు పాదుకొన్నవి!!
విష్ణు వీగతి జగద్రక్షణ
కృష్ణుడై జనియించె నేమో!!

గోలోకపు నిత్య కృష్ణుడె
భూలోక విలాస కృష్ణుడు
గా సముద్భవమందె జగతిని
రాసలీలోల్లాస మొసగగ.

ఇతడె పో, బ్రహ్మణ్య దేవుడు,
హితుడు గో బ్రాహ్మణుల కితడు;
ఇతడె సర్వజగద్ధితాత్ముం
డితడె గోవిందుండు కృష్ణుడు.

ఏ మహాహ్లాదైక శక్తికి
ఈ మహాద్భుత శిశువు ప్రతినిధి?
ఆ మహా నేతృత్వమున మన
బాము లిక రస ముగ్ధమగునే.

ముందు తన హ్లాదిని జనింపగ
నంద గృహ మితండు సేరెనె ?
ఎవ్వ రాహ్లాదైక రూపిణి ?
అవ్వరూధిని 'రాధ' యేనా ?

ఎందరెందరొ సుందరీమణు
లిందు గుమిగూడంగ నీతడు
ముందుగా తన వాడి చూపుల
నందుకొ లక్షించె రాధను!!

పలుకు డిపుడే రాధ నామము
ఉలికిపడు బాలుండు, చూడుడి!
ఉలికిపడుటే కాదు, దేహము
పులకితము, చైతన్య దీప్తము.

రాస జగదీశ్వరుం డీతడు
రాస జగదీశ్వరియె రాధిక
కలసి మనతో రాస నృత్తము
సలుప బ్రహ్మానంద మొదవును.

వివిధ తనుగత మహాగ్రంథులు
వివృత మగు నీ తను స్పర్శను;
మహాభావావేశ మహిమను
మహీతలమే సంచలించును.

గుణమయంబగు తనువులే, ని
ర్గుణంబగు నీ తనువు సోకగ;
దేహములపై భ్రాంతి తొలగును
మోహ పాశ వినాశనం బగు.

సకల నర ఋషి దేవ వితతికి
ప్రకటి తోజ్జ్వల లక్ష్య మీతడు;
పంచభూతము లితని సన్నల
సంచరించు విధేయతామతి.

పిల్లగ్రోవి నితండె యూదిన
ఉల్లములు రాగాతిశయమగు;
లక్షలాదిగ గో గణావళి
లక్షణముగా నాదవశమగు.

వేణు వూదుచు నీత డిక మన
ప్రాణములు చెరబట్టు నేమో ?
వెతలబడి మన మతని జేరిన
కతలు, నీతులు చెప్పి పంపునో..?

ఇతని సేవకు గాదె మన మి
ట్లతివలుగ జన్మించినారము ?
ఇంత యింతనరాని భాగ్యము
ఇంతులకు గలదే మరెందును ?

మనుజమాత్రుడు గాడితం డతి
మానుషం బవతార మెత్తెను!
దనుజ భావన రూపుమాపగ
అనువుగా ప్రేమామృతం బిడ.

అద్భుతా లెన్నెన్నొ సల్పగ
ఉద్భవించిన అర్భకుండో!!
ఈ మహానందాంగనా సుతు
నామ మహిమం బెంత చెలగునో ?

ఎంత దివ్యం బితని నామము ?
ఎంత దివ్యం బితని హాసితము ?
ఎంత దివ్యం బితని నయనము ?
లెంత దివ్యం బితని మూర్ధము ?

ఎంత దివ్యం బితని చిబుకము ?
ఎంత దివ్యం బితని యుదరము ?
ఎంత దివ్యం బితని పదములు ?
అంతటా దివ్యత్వమే కన.

ఎంత వక్రం బితని భ్రూకుటి ?
ఎంత గుండ్రని వితని ముంగురు ?
లెంత నల్లన యితని కేశము ?
లెంత దీర్ఘం బితని యంగుళు ?

లెంత మధురమొ యితని యధరము ?
లెంత దృఢమో యితని జానువు ?
లెంత నవనవ మితని కవళిక ?
లెంత మధురాధిపతి యీతడా!

ఎంత వాడియొ యితని నఖములు ?
ఎంత తీక్ష్ణం బితని చూపులు ?
ఎంత దీర్ఘం బితని బాహులు ?
ఇంతవా డేజగతి గలడే ?

ముద్దు గొనుడీ యితని బుగ్గలు
ముద్దు వెట్టుడి యితని ఫాలము
ముద్దు లిడుడీ యితని మూర్ధము
ముద్దులను నుదరమ్ము నింపుడి!!

ఇతని సర్వాంగముల బొదవిన
అతుల చేతనలో రహించుడి!
మథనమగు మన మానసాంబుధి
సుధాప్లావితమగు నెడందలు!!

అందచందా లన్ని పాపని
యందె ప్రబ్బెను సార్థకత్వకై
అందగత్తియ లంద రీతని
పొందునకు పరమోత్కంఠలు!

శ్రావణపు మేఘమ్మొ యీ గతి
పావనము నరరూప మెత్తెను!
భువిని దివిగా మార్చుగల నవ
నవోన్మేషపు తేజ మీతడె!!

శ్యామలాంబే మోజుపడి యీ
శ్యామలాకరమ్ము దాల్చెనొ?
శ్యామలం బొనరించి జగతికి
క్షేమమును యోగమ్ము గూర్చును!

శిశువు గాదు, రమేశ్వరుండే!
విశద జగ దధిశాసకుండే!!
దుష్ట జనతా శిక్షకుండే!
శిష్టలోక త్రాత యగునే!!

ఇతని వాక్కే బ్రహ్మ వాక్కగు
ఇతని నడలే హంస నడలగు
ఇతని శ్వాసమే వేణునాదము
ఇతడె పో! శ్రుతి మనోహరుడు!!

బుడత డీతడు పుట్టుకతమున
పుడమి గతు లేర్పడును; క్రొత్తగు
నడలకే క్రొంగొత్తతనములు
వడిగ నేర్పడు నితని కతమున.

బుజ్జికన్నను చూచితిరి కద!
బొజ్జ యెంతటి పూర్ణబిందువో!!
నిఖిల జగములు దీనిలోనే.
సుఖముగా వసియించు నేమో!!

బాల బ్రహ్మము బొజ్జలో వే
దాలు వినబడు నాలకింపుడి!
ఊదుచున్నా రెవరో వంశిని
వేద నాదము లతిగమించగ.

కురుల మురువిది గాంచినారే?
ఇరుల తుమ్మెదగముల మించును;
నింగి మబ్బులు వీని తలపై
వంగి తిరుగును, నెమిళు లాడగ.

నాభి - కమలము కన్న మిన్నగ
శోభితంబగు, చూడు డిదిగో!
కమలనాభుం డీతడేమో!
విమల మతి యోజించి యరయుడి.

ఈ కరాంగుళు లెన్నతరమే?
పైకి మృదులము, లోన కఠినము!
వేణుగాన విశారదుం డగు
జాణయగు భూభృత్తు లెత్తగ.

ఎంత ఆంగిక సౌష్ఠవమ్మో!
సుంత మీరే సంస్పృశించుడి;
మల్ల వీరులనైన అట్టే
తల్లడిల్లగ జేయునేమో!!

చెల్లునిక మన సమయ మీతని
యల్లరులతో నుల్లమలరగ;
మన నిమిత్తమె యితని రా కిటు
ఘనముగా కైసేత మీతని.

దృష్టి లూరక నిల్ప బోకుడి
దృష్టి దోషము తగులు నేమో!!
సృష్టిలో నిటువంటి పాప డ
దృష్ట; మంతయు మన యదృష్టము.

తల్లి పాలకు బొజ్జ నిండక
తల్లడిల్లునొ యేమొ పిల్లడు?
తల్లులారా! మిగులు పాలీ
పిల్లవాని కొసంగి పెంచుడి.

తగునె పాలందరి వొసంగగ?
వగల నారిగ వచ్చి రక్కసి
పాలుగా విసమునే త్రాపిన
బాలకుని బ్రతికింప గలమే?

అమృతమైనా విషంబైనా
సమముగా గైకొనెడి జాణే!
విషము నమృతముగా నొనర్చె
రస విదగ్ధుం డీ కుమారుడు.

శాప సంతప్తులకు నీతం
డొప్పు గూర్చ విముక్తి; తనచే
చచ్చువారల తేజమును రా
నిచ్చు చేరగ స్వాత్మలోనికి.

'పట్టి నిన్ వధియించు పాపడు
పుట్టె పల్లె'ను నింగి మాటల
కట్టె కంసుడు బెదరి, పిల్లల
మట్టుపెట్టగ చూచునేమో?

తలప గుండెలు బ్రద్దలగునే?
కలతపడి క్రుంగును మనస్సులు;
ఈ మనోజ్ఞ కుమారు డేగతి
ఈ మహాపదలెల్ల దాటునో?

బాలునకు పాలేమి కొరతే?
వేలవేల్ ధేనువులు లేవే?
పొదుగు లితనికి నివేదించిన
పిదపనే బిడ్డలకు కుడుపును.

తనదు చన్నితనికి గుడిపిన
వనిత బ్రహ్మానంద మందును;
తనను, తన సర్వస్వ మిచ్చిన
వనిత గోలోకమే యేలును.

కొంచె మెదుగగ నిండు, తదుపరి
సంచరింతము, సతత మాటల;
ఇతని తోడిదె లోకముగ, మన
కితడె సంతత మేదుగదగా.

ఏకపత్నీ వ్రతుడ? లేక అ
నేకపత్నీ వ్రతుం డీతడ?
ఏక నిమిషమునం దనేకుల
నేకరతి లాలించు రమణుడె !

అనేకము నందున్న యేకము
కన రనేకులు స్థూల బుద్ధులు;
బుద్ధి సూక్ష్మత సర్వ మితనికి
సిద్ధమగు, దర్శించు నేకత.

భర్త యన భరియించువాడే!
భర్త లందరి భర్త యితడే!!
అట్టి భర్తగ మనల నిక చే
పట్టి గల డీపట్టి గట్టిగ.

కారలంబడి క్రమగ్గు స్త్రీలకు
వీరు డీతడు స్వేచ్ఛ గూర్చును;
స్వేచ్ఛగా ప్రేమించువారికి
స్వచ్ఛ ప్రణయామృతము పంచును.

ప్రేమలేఖను బంపు పడతిని
క్షేమముగ పెండ్లాడి తీరును;
తిమిని బ్రహ్మని చేయజాలిన
అమిత మహిమంతుండు బాలుడు.

శరణు శరణని వేడు వారిని
కరుణ బ్రోచు దయాసముద్రుడు;
అహము గ్రుడ్డెగదన్ను వారికి
ఇహమునన్ తత్ఫలము గుదుపును.

ఆర్తితో ప్రార్థించు జీవుల
పూర్తి రక్షణ తా వహించును;
కపట నాటక మాడువారల
చపలతకు తెర దింపగలడే!

జగన్నాటక సూత్రధారిగ
జగత్ప్రాణాకృతులు త్రిప్పును;
రాజనీతి ధురంధరుండును
రాజ తంత్ర నియంత యగునే!

తనను నమ్మిన ప్రియ సహోదరి
మనసుపడు మనువునే గూర్చును;
అన్న డాంబిక వృత్తి వాపి, ప్ర
సన్నమతి గావింప ఘనుడగు.

ఇతని మాటలు - తత్త్వశాస్త్రము;
ఇతని చర్యలు - ధర్మశాస్త్రము;
ఇతడు సర్వజ్ఞుండు, పూజ్యుడు;
ఇతడు హీను డటన్న తల తెగు.

వెన్న, మీగడ, పాలు, పెరుగులు
కన్ననికి నైవేద్య మీయక
యున్న, వాటి నతండు దొంగిలి
ఎన్ని తిప్పలు పెట్టునోగద!

స్వార్థబుద్ధికి స్వస్తినిడి, పర
మార్థమును చేపట్ట కున్నచొ
ఘోషమే ఘోషింప తా సం
తోషపడెడి కుమారు డీతడు.

వెన్న మీగడ దొంగిలించిన
కన్ననికి ఏ శిక్ష వేతము?
హృదయ కారాగారములలో
పదిలముగ బంధింత మీతని.

దొంగ యితడని సాక్ష్యములు పర
గంగ చూపినగాదె శిక్షలు?
దొంగ మనలనె దొంగ జేసిన
భంగపడి విలపించుటే గతి!!

ఈ చరాచర జగత్ప్రభువే
దోచుకొను మన ధనము, ప్రాణము;
పంచిపెట్టును సమాజానికి
సంచితార్థావళి సమస్తము.

మన మనోవాక్కర్మములలో
వినూతన చైతన్య మొదవగ
పుట్టెనే 'జనముద్దు'బిడ్డడు
ఉట్టిపడ సచ్చిదానందము.

సర్వదేవత లితని దర్శన
పర్వమునకై తారసిల్లిరి
యింటి లోపల, నిదే నే కను
గొంటి, తొలగుదు, దారి చూపుదు.

ఇందు వదనము పూర్ణముగ ఆ
నంద భరితము, సుశోభిత మగు;
నిశీధిని శిశు వుదయమందగ
శశికి చేకురు మహానందము.

మహతి నడ్డము పెట్టుకొని, అ
మ్మహిత ఋషిసత్తముదు, నారదు
డరుగుదెంచుచునుండె, కంటిరె?
గురుతునిడ, సంగీత శిక్షణ.

మెత్తమెత్తని పొత్తికల మే
నొత్త జేయుడి చిత్తములరగ;
పాప మేనే పొన్నుగా గల
పాపడే యీ భోగపురుషుడు.

హృదయ వటపత్రమున శిశువును
పదిలముగ శయనింప జేయుడీ;
ఒదవు నాత్మానంద సంస్థితి
సదాశివులముగా తరింతము.

ఎవరితో వేదాది విద్యలు
చివరి దా కిత డభ్యసించునొ!
అట్టి గౌరవ మహోర్జుర డెట
పుట్టెనో! చరితార్థుడాతడు.

గురువె యితనికి విద్య నేర్పునొ?
గురువుకే యీతందు నేర్పునొ?
చిత్రమౌ శిష్యత్వ మితడు ధ
రిత్రిపై నెలకొల్పునేమో!!

గురువులకు సవిధేయు డీతడు
గురువులకు పరిచర్య సల్పును;
గురు జనావళి ఆర్తివాపగ
పరువులిడు యముతోడ పోరగ.

ఈతడే ఆదర్శ శిష్యుడు
ఈతడే ఆదర్శ గురువగు
ఈతడే ఆదర్శ మిత్రుడు
ఈతడే ఆదర్శ దైవము.

ఎన్ని యెన్ని మహాద్భుతాలను
చిన్నతనమున చేసి చూపునొ?
ఎన్ని కలతలు తెచ్చిపెట్టునొ?
కన్న నిక నేమన్న నేమగు?

ఎట్టి కామోత్కంఠచే చే
పట్టినారమొ వనిత జన్మము?
ఈ మహాశిశువర్ధనముచే
కామితార్థము పడయ గలమే!!

ఇతడు పెరుగక జగద్గురు వగు
ఇతడు పెరిగి జగద్గురుం డగు
ఇతని వాక్కులు జగజ్జనులకు
సతత పారాయణపు గీతలు.

ఇతని కంటెను వేరె దేవుడు
కతల గలడని కలత పడకుడి;
ఇతని వలె చిద్ఘనానందుని
వెతకి తేగల వేత్త గలడే?

సమయ మగునెడ నితని కడ ఆ
అమరపతి శిరమ్మైన వంగును;
బ్రహ్మదేవున కొదవు గర్వము
వమ్ము సేయుగలాడు, కన్నడు.

మనకు గల దాసత్వ మంతయు
మనకు గల వాత్సల్య గరిమము
మనకు గల సుస్నేహ సంపద
మనకు గల మాధుర్య మహిమము

ఇతని చెలిమిని వృద్ధిగాంచును
ఇతని బలిమి రసత్వ మొదవును
ఇతనికే తను మనః ప్రాణము
లతివలారా! సమర్పింతము.

మన శరీరము లింద్ల నుండిన
మనసు లీతనితో బిగింతము;
మరపురా డీబాలపరమే
శ్వరుడు మన కిక జన్మ జన్మల.

భూమి చాలక యితని నర్తన
పాము పడగల మీద సాగునొ?
కొండ కోనలలో ధ్వనించును
మెండుగా మురళీ నినాదము.

మనకు గల యనుబంధ మితనితొ
అనిర్వచనీయముగ నున్నది;
ఇతడె మన కాత్మీయు డన, హృ
ద్గతములగు సాక్ష్యములు గలవే?

మన కితండు పరుండె నిక్కము
మనము మాత్రము పరుల మోదమ?
ఈ పరాపర చింత కాల
క్షేపకులకే! మనకు తగదే!!

ఎట్ట యెదుటనె దైవముండగ
ఇట్టు లీవిచికిత్స లేటికి?
అపర బుద్ధులు మాని యిక నీ
సుపరిచితు సేవింపబూనుడి!

చతుష్షష్టి కళాప్రవీణుడు
చతురమతి సందీప్తుడగు నీ
కన్న కెవడే సాటి మేటన?
వెన్న యెద నైవేద్య మొసగుడి!!

వెన్నముద్దల నారగించిన
వన్నె తేలడె కన్న డికపై;
పెరుగు మీగడ పాలు త్రావిన
పెరుగు నేమో? బుద్ధి కుశలత!

బాలుడని సంకోచ మేటికి?
బాలపరమేశ్వరుం డీతడు!
లీలగా బాలుండె కానీ
ఏలగల డీరేడు జగములు.

ఇతడె నిఖిల రసామృతాత్ముడు
ఇతడె కరుణారస సముద్రుడు
ఇతడె చైతన్య స్వరూపుడు
ఇతడె ప్రేమానంద గాత్రుడు.

ఎన్ని యాశలు పెట్టుకొంటిమొ
చిన్ని పాపనిపైని యని మీ
రెన్నబోకుడి! యన్నిటికి తగ
మన్ననలు సమకూర్చగలడే!

ఆశలా? యివి, కావు, హృదయా
కాశమున వెలుగొందు తారలు;
విరగ గాసిన వెన్నెలగునే
విరుల వలె వాసించ గలవే!!

బిడ్డగానే చేయగలడే
దొడ్డపను లవలీల నెన్నో!
ఈ మహాద్భుత శిశువు పోకడ
లే మహీస్థలి కనదు వినదిక.

ఒక్క నిముసం బితని చూడక
చక్కబడవే మన మనస్సులు;
నిక్కముగ మన కాపురమ్ములు
ఇక్కడే వేగించు టుచితము.

పెద్దవాడై యితడు పల్కెడు
సుద్దులవి మన కర్థమగునా?
పాల మీగడ కన్న తీపగు
బాలకుని వెడతొక్కు పల్కులు.

ఇతని కన్నులు సూర్యచంద్రులు!
ఇతని నుదురే నింగి యంగడి!!
ఇతని బుగ్గలు మబ్బు తునకలు!
ఇతని కురులే చిమ్మచీకటి !!

ఇతని యుల్లము పాలసంద్రము!
ఇతని రసన, రసాల సారము!!
ఇతని ముఖమే యమృత కలశము!
ఇతని నాసిక, మేటి సంపెగ!!

ఇతని యుదరము, సకల విశ్వము!
ఇతని కరములు, దాన ధర్మము
లితని పదములు పంకజమ్ములు!
ఇతడె జగదాధార కేంద్రము!!

నామ రూప గుణాధికతచే
భూమి కితడభూత పూర్వుడు;
ఆసకల సమ్మోద లీలా
వేశు డానందాబ్ధి చంద్రుడు.

ఈ శిశూదయ వార్త విని, ఆ
వేశ భయ కంపితుడు, కంసుడు
ఎట్టి దుష్ట నిశాచరుంచే
చుట్టు ముట్టించునో? వ్రజమును.

ఎట్టు లీశిశు రక్షణ మ్మని
కొట్టుమిట్టాడకుడి! వనితలు!!
శిశువు, శిశు వనుకొనుట భ్రాంతియె
వశము శక్తులు సర్వ మితనికి!!

ఎన్ని యవతారాల నెత్తెనొ!
చిన్ని యిప్పు డిట్లవతరించెను!!
పున్నెములు కదు పచేళిమమగు
కన్నులకు కళ్యాణ మొదవును.

బోటి! వే టీ బాలకుం డా
నాటి మత్స్యమె యవతరించెన?
కదుపు నీతడు కాలు సేతులు
కుదురుగా శ్రీకూర్మ మట్టుల!!

పరీక్షింపగ గోచరించును
కిరికి గల లక్షణాలేవో!
చిన్ని నరసింహమ్ము పగిదిని
ఉన్నవా డనిపించు తీవ్రత!!

ఇందు వదనము, ముందు చూపులు
అందచందా లన్ని కనుగొన
రాముడే, రేపల్లె నాత్మా
రాముడై యిట్లవతరించెనొ?

రాముడే యీతండు, పూర్ణ
శ్యామ లాకారుండు దిగెనే!
ఎందుకే యీ పోలికలతో
నందనందను కొంచెపరచెదు?

ఇతడు తగు వేదావతారుడు
ఇతడు తగు నాదావతారుడు
ఇతడు తగు ప్రణయావతారుడు
ఇతడు తగు కేళీవిలాసుడు.

వట్టి యవతారుండు గాడే!
గట్టి యవతారియే యిత డగు;
సూత్రధారుడె నాయకుడుగా
పాత్రధారణ చేసె నీగతి!!

ఎవరికోసం బీకుమారుం
డవతరించె యశోద ప్రక్కన?
తన మహోహ్లాదినిని చూడగ
మనసుపడి యరుదెంచె నేమో?

దొంగచూపులు చూచునప్పుడె
అంగనలు! పరికించినారే!
కన్నుగొట్టుచునుండె యిప్పుడె
కన్న! యెంతటి పోకి రగునో!!

అల్లనల్లన నితడు పెద్దై
అల్లరులు ప్రేరేచి పల్లెను
అల్లకల్లోలం బొనర్చిన
తల్లితో మొరబెట్ట వినునే?

పిల్ల లల్లరి సేయరే? ఈ
పిల్లవానికె నొసట రాసెనె?
ఎప్పు డీశిశు వేదొనర్చిన
తప్పు కది మన మహాభాగ్యము.

ఇతని బట్టగ మన వశంబే?
ఇతని గట్టగ మన తరంబే?
ఇతనితో మన యశోదమ్మకు
కత లనేకము గల్గు నికపై!!

యశోదమ్మకు మాత్ర మీతడు
వశుడుగా వర్తింప గలడా?
రోట గట్టిన, తిట్టి, కొట్టిన
మాట చెవినిడి మసలుకొనునా?

మన్ను తిన్నా, లేదు, తిన లే
దన్న మాటనె నిరూపింపగ
కన్న, మాయలమారి, లోకా
లెన్ని చూపునా నోట తల్లికి?

తిప్ప లెన్నో పుత్త్రికులచే
తప్పవే, యే కన్నవారికి!
సంతు లేదను బాధ యొక్క టే!
సంతు గల్గిన బాధ లెన్నో!!

అల్లరందరి పిల్లలవి, ఈ
పిల్ల డొనరించేవి లీలలు!
అల్లరికి, లీలలకు భేదము
తెల్లమగునే? విచారింపక!!

చల్ల లమ్మగబోవు నప్పుడు
మెల్లగా మన కొంగు లాగిన
మంచి మాటల బాలకుని వం
చించు విద్య గడించవలెనె!!

ఇతడు పెద్దై వేణు వూదిన
సతమతంబగు మన మనస్సులు;
తీవ్ర కామోత్కంఠ మునచే
ఈ వ్రజమ్మును వీడజేయునో?

ఇతనిపై మమకార మెక్కుడు
అతివలారా! పెంచుకొనకుడి!
చివర కీతని వియోగానల
మెవరు భరియింపంగ నేర్తురు?

చదువు సంధ్యలు లేనివారము
ఎదల బాలుని పదిల పరచుడి;
చదువులన్ నెరజాణ లందరు
చదువుకొందురు మన చరిత్రలు.

ఆరునే కామాగ్ని జ్వాలలు?
తీరునే మనలోని తమకము?
ఎప్పుడీతడు నడల నేర్చునొ?
ఎప్పుడీతని తోడి యాటలొ!!

ఎంతగా పైకెగరవేసిన
నుంత యేద్వ వదేమి వింతో!!
ఎంతగా నెద హత్తినా ఆ
వంత కూడ చలింపదేమే?

ఈతడగునే నిర్వికారుడు?
ఈతడేనా అవ్యయాత్ముడు?
ఈతడేనా అచ్యుతుండన?
ఈతడేనా వాసుదేవుడు?

అపరిమితుడే పరిమితుండై
అపరిమిత సమ్మోద మొసగును;
అవ్యయుండే వ్యయాకృతితో
అవ్యయానందం బొసంగును!!

ఇతని కథలే పురాణావళి
కృతుల రసవత్కావ్య వస్తువు;
అగునె యద్భుత బాలకుండిక
జగన్నాటక సూత్రధారుడు?

ఇతండెవ్వడో యెవరి కెరుకే?
ఇతని జాడలతో పనేమిటి?
ఇతని కన్నది మన యశోదే!
ఇతడె మన సర్వస్వ సంపద!!

రాగ రహితుడు రాగమయు డగు
భోగ రహితుడు భోగమయు డగు
కర్మ రహితుడు కర్మమయు డగు
ధర్మ రహితుడు ధర్మ విభు డగు.

అవాఙ్మానస గోచరుండే
అవతరించెను - వాఙ్మనస్సుల
కందు నట్లును - అంద నట్లును
అందియందని యట్టు లోకపరి.

నిరామయుడే ఆమయుండయి
నరుడుగా రూపొందె మనకై;
నరుడు నారాయణుడు నీతడు;
పరగు పరమాత్ముండు, జీవుడు.

చారు రూపుడు, చారు హాసుడు,
చారు చంద్ర కళాత్మకుం డీ
చరాచర జగదధీశ్వరు డీ
పరమ పావనమూర్తి, చూడరె!

సకల ధర్మము లితని ముఖతః
వికసి తోజ్జ్వలమగు జగమ్మున;
బహు రసమ్ములు వీని చర్యల
బహు విధాస్వాదనకు నుచితము.

నగరిలో జన్మింప కితడు
తగునె జనపదములకు చేరగ?
పెరుగు, పాల్, మీగడలు మెక్కుట
తిరిగి చేరునా నగరి లోనికై?

నమ్మరాదే పురుషులను, వార్
వమ్మొనర్తురు స్త్రీల యాశలు;
నమ్మ కేగతి యుండనేర్తుము?
నమ్మికే యన్నింటి మూలము.

స్త్రీల శత్రులు స్త్రీలు మాత్రమె
ఏల పురుషుల నిందసేయుగ?
ఒకతె వలచిన పురుషునే వే
రొకతె చేరకయున్న చాలదె!

మగల బులిబుచ్చికము లెరుగక
మగువ లెప్పుడు మోసపోదురు;
నగర మేగిన యప్పు డచ్చటి
మగువ లీతని చేరదీయరె!

జనపదమ్ముల పుట్టి పెరుగుచు
జనపదాలు తృణీకరింతురు!
ఎల్ల జనులకు నగరములపై
వల్లమాలిన వలపదేటికి?

సుగముగా జీవింప వచ్చుని
నగర వాసము నభిలషింతురు;
వికృత జీవన మబ్బుగా నిక
ప్రకృతిపై వలపే నశించును.

ఇతడు నగరము సేరుకొన్నచొ
సతమతంబగు మనదు బ్రదుకులు;
వికృత పురుషుని తోడి పొత్తిక
ప్రకృతి కేమాత్రమ్ము కుదరదు.

వికృతి యని మానుదుమె పెరుగును?
వికృతి యని మానుదుమె యన్నము?
వికృతి యని విడుతుమే నగలను?
వికృతి యని కట్టమే గృహములు?

ప్రకృతి వంటిదె వికృతి కూడను;
ప్రకృతిపై సర్వాధిపత్యము
వికృతిదే యిక ముందు యుగముల!
ప్రకృతి సంరక్షణమే కష్టము.

ప్రకృతిలో గల వికృతి ధర్మము
వికృతిలో గల ప్రకృతి ధర్మము
నికషముగ గుర్తింప గల్గిన
సకల మానస వికసనంబగు.

బింక మంతగ తగదు, స్త్రీ మన
సింకి పోయిన బ్రదుకు శూన్యము;
వాడిపోయిన కొలది పొగడలు
పోడిమిగ వాసించ గలవే!

మనసు వికృతంబైన వ్యక్తితొ
మనసు కల్పుట సాధ్యమగునా?
తత్త్వసందేశాలు విన నా
యత్తములు గావే యెదందలు!!

విరహమందే ప్రేమ తీవ్రత
పరాకాష్ఠకు చేరుకొనునే!
విరహతాపానలమునకు మన
శరీరా లాహుత మొనర్తము.

ప్రేమకై తప్పవే తిప్పలు
ప్రేమ కొరపిడి రాయి విరహమె!
విరహమందే ప్రేమ సఫలము!
విరహమందే ప్రేమ పూర్ణము!!

ప్రకృతి వికృతి కతీత శిశు వీ
సుకృతుడా పురుషోత్త మోత్తము
తోడి మన దివ్యానుభూతికి
నేడె పల్కెడి నాంది వాక్యము.

అట్టి మన దివ్యానుభూతులు
కట్టు డీ పాటలుగ నిత్యము;
ఉట్టిపడ సౌందర్య సంపద
పట్టి శోధింపగ మనీషులు.

వీని దర్శన స్పర్శ నాదులు
మానవతుల కనర్ఘ భాగ్యము;
ఈ వ్రతాచరణమ్ము దినదిన
తీవ్రతర తమ రూప మెత్తుత!

ఇతడు సర్వరసాధి దేవత
ఇతడు శృంగారాధిపతి యగు;
ఈత దద్భుత రస విధాతృడు
ఆతతానందాత్మ డమృతుడు.

ఇతడు పెద్దై మనల మరచిన
వెతల పాలగు మనదు బ్రతుకులు;
ఇతం డెదుగక యిల్లె యుండెడి
విత మదెట్టిదొ వెతకి పట్టుడి!!

బాలకృష్ణుని గూర్చి గీతా
లాలపింతము దినదినమ్మును;
జోలపాటలు కట్టి పాడుడి!
మేలుకొల్పులు మేళగింపుడి!!

పురుష మోహనుడగు కతమ్మున
పరమ పురుషశ్రీ యితండగు;
స్త్రీ మనోంబుధి త్రచ్చు కతమున
కామ విజయశ్రీ యితండగు.

పాడి త్రచ్చుచు పూర్వగాథలు
పాడుకొంటిమి, చాలు, నికపై
బాలకృష్ణు డొనర్చు మహిమలు
లీల లేపుగ పాడుకొందము.

జయము జయము యశోద తనయా!
జయము గోపీ జనాహ్లాదా!!
జయము జగ దానందకారక!
జయము జగదుద్ధారణ వ్రత!!

జయము పులకిత ప్రకృతి గాత్రా!
జయము ముగ్ధ మనోహరాకృతి!!
జయము నయనానందదాయక!
జయము నాదవశీకృతాత్మా!!

జయము సంగీతావతారా!
జయము శిఖిపింఛావతంసా!!
జయము సత్యోన్మేష చరితా!
జయము మేఘశ్యామసుందర!!

జయము నందానంద వర్ధన!
జయము సకల కళాధురంధర!!
జయము ధరణీభార సులభా!
జయము స్నిగ్ధప్రేమమూర్తీ!!

జయము రసవత్కథా నాయక!
జయము గోకుల రక్షణోద్భవ!!
జయము బలరామానుజశ్రీ!
జయము కృష్ణా! జనాకర్షక!!

జయము సుందర శివానందా!
జయము మందస్మిత ముఖాంబుజ!!
జయము గోపకుమార మిత్రా!
జయము కృష్ణా! తృష్ణ శమనా!!

హారతీయుదు, జగత్కృష్ణా
కారునకు, పరమాత్మ శిశువుకు;
సర్వ పాప చయమ్ము పాపెడి
సర్వతోముఖ రమ్యమూర్తికి.

అందములకే అందమిదు ఆ
నంద సుందర సుభగ మూర్తికి
మంగళము, శుభమంగళంబని
అంగనలు! హారతులు పట్టుడి!!

పరమధర్మ రసాధిపతిగా
ధరణిపై కిట్లవతరించిన
నిరుపమాన పవిత్రమూర్తికి
నెరపుడీ నీరాజ నాంజలి.

పులుముడీ పరిమళపు నూనెలు
నలుగు పెట్టుడి నలుపు విరుగగ
జలధి శయనుని జలక మార్చెడి
కలిమి మనదే, చెలిమి మనదే!!

శ్రుతి మనోహరు డితడు, గళములు
శ్రుతి యొనర్పుడి జోల పాడగ
భద్ర మూర్తిని వేగమే తగ
నిద్ర పుత్తము, సుకృతమే యిది!!

నిద్రపోరా! చిన్నికృష్ణా!!
నిద్రగనె, బలభద్రు డెపుడో!!
నిద్ర నీవె వహింపకుండిన
నిద్ర పోదీ ప్రకృతి సర్వము.

ఓ మహోజ్జ్వల శిశు వికాసా!
ఓ మహాలీలా వినోదా!!
ఓ మహాశృంగార సాగర!
ఓ మహాత్మా! నిద్రపొమ్మిక.

ఓ మహాయోగేశ్వరేశ్వర!
ఓ మహా గానాబ్ధి చంద్రా!!
ఓ మహావైభవానందా!
ఓ ముకుందా! నిద్రపొమ్మిక.

ఎల్ల స్తోత్రము లిప్పుడే యిటు
వల్లె వేసిన రేపు సున్నగు;
చాలులే యీ పూట కెట్లో
బాలకా! నిద్రింపుమా యిక.

మేము సామాన్యులము, బాలక!
ఏమి విద్యలు రానివారము;
ప్రొద్దు ననగా వచ్చినారము
సద్దుమణిగె వ్రజమ్మ, పోవలె.

మక్కు వేల కుమారకా! నీ
కెక్కుడగు స్తుతి పాఠములపై;
ఎదుగు కొలది ప్రవృద్ధి గాంచునొ?
మదిని స్తోత్రములందు మక్కువ.

నిన్ను నిద్రోపేతు జేయుగ
నున్న పూనిక వమ్ము సేయకు;
కరుణ జూడుము, మమ్ము, నిద్రను
తరుణమైనది యిండ్లకేగగ.

ఓయి! నిర్నిద్రాత్మ రూపా!
హాయిగా నిద్రింపు మిచ్చట;
ఎంతొ కాలము గలదురా నీ
వింత చర్యలు ప్రదర్శింపగ.

నీవు సల్పెడి లీలలే మా
జీవనమురా! యశోదాత్మజ!!
నీవు లేనిదె మాదు బ్రదుకులు
జీవమున్న శవాలు, చిన్మయ!!

పట్టి మాటల నిద్రవో డీ
పట్టి, సంకీర్తన ప్రియుడే!
నామ సంకీర్తనము మనకును
క్షేమమును చేకూర్చ గలదే!!

గోకులములో కోతు లెన్నో
నీకు ముందె జనించె నవిగో!
నిన్నె తమకవి నాయకునిగా
నెన్నుకొనుతే! నిద్రపొమ్మిక.

కోతి మూకలతోడి చెలిమిని
ఈత. డేగతి నోర్వగలడో!!
పిల్లడే యని జాలి చూపక
గిల్లి కజ్జాల్ పెట్టుకొందురొ?

చిక్కె దొంగని పైని కూర్చుని
చిక్కములతో మోద నోర్చునె?
మేన నెత్తురు చిప్పిలంగా
కూన నెవరోదార్చగలరే?

స్నేహమునకై ప్రాణ మిచ్చెడి
సాహసికు డీ కుమారుండే!!
ఇతడు సఖుల కవాంఛితముగా
అతుల సౌభాగ్యమ్ము లొసగును.

త్వరగ నీవిక పెరిగిపోరా;
చిరుత మువ్వలు మారుమ్రోగగ
పరుగు లిడరా! మా యెడందల;
చిర తపస్విదిరా! కుమారా!!

పెరుగు, పాలును దొంగిలింపర
తిరుగులే దీవేమి చేసిన;
దొంగవని నిన్నెంచి పల్కక
అంగనల కవకాశ మీయర!!

సొంత సొమ్మునె అపహరించే
వింత దొంగవు నీ వొకండవె!
అంత నీదే యనెడి విజ్ఞత
సుంత లేని జగత్తురా యిది!!

ఒక్కపరి ఓ చిదానందా!
మక్కువను నిన్నెదద హత్తెద
మృణ్మయము దేహేంద్రియాదులు
చిన్మయశ్రీ శోభితంబగు.

తల్లి వీవె, తండ్రి వీవె
ఎల్ల బంధు మమత్వ మీవే;
నల్లనయ్యా! నీవెగా మా
ఉల్లముల నెలకొన్న దైవము.

ప్రొద్దువోయెనురా! కుమారక!!
సద్దుమణిగె ప్రపంచమెల్లను;
ఇంటివారిక మమ్ము బయటికి
గెంటెదరు, సెలవిచ్చి పంపర!!

వీడగా నిన్ మనసు రాదుర!
వీడకుండిన కొంప గోలగు!!
కోపగింతురు మగలు, మా పరి
తాప మెరుగని మందబుద్ధులు.

మునిగినా మేమింటి పనులను
మనసు నీ మీదనె కుమారక!
మురళి నూదుచు పిలుపు నీరా
పరుగునన్ పాదాల బడెదము.

నిండు నడిరేయైన గానీ
మండిపడి యెవ రడ్డినా నీ
అండ బలమే తోడు రాగా
కొండ కోనలు దాటి వత్తుము.

అంగనలపై జాలి చూపగ
దొంగ నిద్ర కుపక్రమింపర!
వచ్చెదము తెలతెల్లవారక
యిచ్చమెయి నిను మేలుకొలుపగ.

నిన్ను గూర్చిన భక్తియే సం
పన్నమై రససిద్ధి గూర్చును;
భక్తి రస సింధువులు పొంగగ
ముక్తి వాంఛాంకురము లడగును.

భక్తి పరిపూర్ణముగ నెరపెడి
రక్తి, దీర్ఘాయువు నొసంగును;
దివ్య జీవన లక్ష్య సాధన
భవ్యమతులుగ తీర్చిదిద్దును.

నీ మహాద్భుత దివ్యశక్తిని
మా మనో దేహేంద్రియాదుల
ప్రేమ నిక్షేపింపు బాలక!
కామితార్థము మాకిదొక్కటె!

మమ్ము నీతో సమానలు గా
నిమ్ము, హాయిగ నాడుకొనుటకు;
యాజమాన్యము నిమ్ము నీపై
యోజనము సేయంగ నిన్నే!!

పోయి వత్తము యశోదమ్మా!
నీ యదృష్ట మనన్య లభ్యము;
ఈ యపూర్వ శిశూదయముచే
మా యదృష్ట మికెట్లు తీరునొ?

తెల్లవారుచు నుండగా మే
మెల్ల పను లొనరించి వేగమె
ఉల్లములు మునుముందు పర్విడ
నల్లనయ్య భజింప వత్తుము.

తిరిగి మేమరుదెంచులో, నే
మరక కాపాడు మీ పాపని;
మాయ రాక్షసకోటి తిరుగు, న
మాయికపు శిశులన్ గ్రసింపగ.

ప్రకృతిలో పెంపొందు నేమో
నికృష్టములౌ దుష్టశక్తులు;
చకచకా నీ వెదిగి పో, త
న్నికరమును వే రూపుమాపగ.

ఓయి నిఖిల రసామృతాబ్ధీ!
ఓయి నిత్య విలాస సుందర!!
ఓయి సత్యానందమూర్తీ!
ఓయి హృదయోల్లాస! సెలవిక!!

ఓ చిదానందా! మహాత్మా!!
మా చరిత్రలు సవదరింపుము;
మాకు నీ తోడిదే లోకము
మాకు నీవే రక్తి ముక్తివి.

మా మహా హృద యాంత రాంతర
ప్రేమ సామ్రాజ్యాధినేతగ
నిన్నె యేకగ్రీవముగ మే
మెన్నుకొందుము, చింత లుడుగుము.

వేగమే నీ వెదిగి మా హృద్
రాగ సాగరమున్ మథింపర!
దాన సంజనితామృతమ్మును
వేణునాదములందు పంచర!!

ఆదిశేషుడు నీదు మురళీ
నాదలోలత తలల నూపునొ!
చతుర్ముఖుదును సుముఖు డగు నీ
అతుల నాదామృతము గ్రోలగ.

ప్రయోగించిన పరుసవేదిని
అయోమయమే స్వర్ణమగు గతి
భవద్దర్శన స్పర్శనము మా
భవగుణావళి మార్చుగావుత.

పుట్టు గ్రుడ్డము, బాలకా! చే
పట్టి యెరుగము విద్యలేవీ!
నీదు మురళీగాన రస మా
స్వాదనమె మా సకల యోగము.

అన్ని విద్దెలు నీవే మాకిక
ఎన్నొ యాశలు రేగు మా మది;
నాథులున్న అనాథలము, మా
నాథనాథుడ వీవె సామీ!!

వేదనామయ జీవితాలివి
ఆదుకొన తగునోయి కృష్ణా!
బండవారిన గుండె పొలముల
పండనీ ప్రేమంపు పంటలు.

నవనవోన్మేషంపు మతితో
నవరసోల్లసితముగ నీతో
సంచరించెడి భాగ్యమును క
ల్పించు మిది యేజన్మ తపమో!!

ఈ గుణాత్మక దేహములు మా
మా గృహాల నిబద్ధమైనా
రాసలీలలు సల్ప భావా
వేశ దేహా లిమ్ము దేవా!

ఆసకల జీవాళి పల్వెడి
వాసుదేవుడు మనకు మిక్కిలి
సన్నిహితుడై సకల హితములు
మిన్నగా చేకూర్పగలడే!!

ఇతడె పో, యజమాని మనకిక
ఇతనికే మన సర్వ సేవలు;
ఇతడె మన కేకైక పుత్త్రుడు
ఇతనికే మన ముద్దు ముచ్చట.

ఇతడె పో మన కూర్మి నెచ్చెలి
ఇతనికే మన స్నేహ సంపద;
ఇతడె పో, మన ప్రాణనాథుడు
ఇతనికే హృదయానురాగము.

నవ విధమ్ముల భక్తి నితనిని
నవనవోన్మేష మ్మొనర్తము;
అహరహ మ్మీ బాలకునకై
ఇహ పరమ్ములు సమర్పింతము.

మూఢ జన్మలమైన గానీ
గాఢ కామోత్కంఠ మతుంటము;
పిలుపు వినగనె విడిచి సర్వము
వలపు కాత్మార్పణ మొనర్తుము.

ఉల్లముల రాగాబ్ధిమణులను
కొల్లగొట్టి జనాళికిన్ కో
కొల్లలుగ వే చేతులన్ వెద
జల్లుమోయి! దయార్ద్ర హృదయా!!

శిశు మహాద్భుత దివ్య దర్శన
వశల, వివశల, గోప వనితల
హృదయ సంస్పందనములకు మీ
హృదయ తంత్రులు మేళగింపుడి.

అంతరంగ స్ఫూర్తితో వ్రజ
కాంత లీ సంభాషణములను
నెరపు సారస్యమ్ము నీ గతి
నిరూపించితి యథాశక్తిని.

అణువులో బ్రహ్మాండములనే
కనిరి గోపిక లెంతవారో!!
విత్తనములో మహావృక్షపు
సత్తగాంచిన క్రాంత ద్రష్టలు.

అపుడె పుట్టిన శిశువు గని, వా
రెపుడొ పుట్టిన వానిగా మా
ట్లాదుదురు కదు వింత ధోరణి;
పదుతు లెంత విదగ్ధమతులో!!

మతులు గల్గి వచించు వితములు
మతులు కోల్పడి పల్కు వితములు
మతులు వివశత పల్కు వితములు
మతి కతీతపు వితము లెన్నో!!

దివ్య శిశు సందర్శనాద్భుత
భవ్య మహిమాతీత మతితో
పల్కు పల్కు లలౌకికమ్ములు
ఒల్కు నర్థము వాని నంటుచు.

శిశువు లందరిలో మహాద్భుత
శిశుశ్రీ ఈ బాలకృష్ణుడె!!
ఈ కుమారుని దర్శనముచే
వాకు వరలును చతుర్విధమై.

శిశువు విద్యుచ్ఛక్తిపాతము;
శిశువు దృష్టులనంత శక్తులు;
శిశు స్పర్శ లనంత మహిమలు
శిశువు లోకాద్భుత విభూతియె.

* * * * *

గోపికా హృదయోల్లాసము
నేపుమీర పఠించు వారికి
భాగవత పఠన మ్మొసంగెడి
రాగమయ జీవనం బలవడు.

ఇమ్మహాద్భుత గోపికా గీ
తమ్ము లెవ్వరు వినిన పాడిన
జీవితము నవరసోల్లసితము
కైవసము కైవల్య పదమే.

పుత్త్రిహీనలు విన్న పాడిన
పుత్త్రిలను ప్రభవింప నేర్తురు;
పుత్త్రి లాగోపాలు కరుణకై
పాత్రులగుదురు జీవితాంతము.

బాల పరమేశ్వరునిపై ము
త్యాల సరములు గుచ్చి తీగతి;
గోపికా భావైక్య సిద్ధికి
నోపగా నుత్కంఠ పాడుడి.

భక్తు లన్నిట పరాకాష్ఠపు
భక్తి యీ గోపికా భక్తియె;
దీనిలో దాస్యాది భక్తులు
లీనమై పరిపూర్ణతను గను.

ఈ మహాద్భుత పూర్ణ భక్తికి
నామ సంకీర్తనమె శరణము;
భాగవత పారాయణము చే
రాగ యోగ మహోదయమ్మగు.

రాగమయమౌ భక్తి సాధన
భాగముగ రచియింతు దీనిని;
అన్యులకు నుపయోగపడుచో
ధన్యతమ మగు నాదు జన్మము.

కమ్మగా నీ గీతతతి గా
నమ్మొనర్చిన వ్యక్తి యుల్లము
ఊయలగ శ్రీకృష్ణు దూగును
హాయిగా భావాంబరమ్మున.

బాలకృష్ణుని చెలిమి, జీవిత
కాలమును సుమ కోమ లమ్మగు;
బాలతన మానంద సాగర
డోలికల తూగాడ జేయును.

బాలకృష్ణుని మీది మక్కువె
చాలు నది కైవల్యపద మగు;
అయోమయమగు పుట్టుకల కత
దయస్కాంతాకర్షణుం డగు.

జన్మజన్మల వాంఛితము లీ
చిన్మయాకారుండు తీర్చును;
తిరిగి తిరిగి జనింత మిలపై
పరమభక్తిపచేళి మూర్ధము.

శాస్త్రశస్త్రము చాల దిక బ్ర
హ్మాస్త్ర మీబాలకుని స్మరణమె;
సకలజీవ మహార్తి తీరగ
సుకర మీశ్రీకృష్ణ కీర్తన.

# సముత్సాహం

## బలే కొడుకు

### గోపికలు

బల్ బలే బలె బలె
బలే కొడుకును గంటివోయమ్మ! ఓ యశోదమ్మా!!
లేక లేకొక ముదుకు కొడుకును గంటివోయమ్మా! ఓ నందపత్నీ!!
కనక కనకొక మాయ కొడుకును గంటివోయమ్మ!
కష్టపడి పడి పడి యల్లరి కొడుకును గంటివోయమ్మ!!
ఎన్నాళ్ల తపమో, పోకిరి కొడుకును గంటివోయమ్మా!!

లేదు లేడిటువంటి కొడు కే
డేదు లోకాలెల్ల వెతకిన
ఏడ తెచ్చితి వమ్మ? వీ డే
వాడ దొరకెనొ నీకు తల్లీ!! ..... బల్ బలే బలె బలె

కొడుకంటె కొడుకే, గారాల కొడుకే
రత్నాల కొడుకే, రవ్వల కొడుకే
వజ్రాల కొడుకే, వరహాల కొడుకే
ముత్యాల కొడుకే, మువ్వలా కొడుకే
మురిపాల కొడుకే, బల్ బలే బలె బలె
బలే కొడుకును గంటివోయమ్మా!!

తేక రేఖా కంటి వాతడు
పోకిరైనా డిప్ప డీగతి;
వేగలేమే యితనితో వే
వేగ పల్లెను వీడిపోవరె!! ..... బలే బలే బలె బలె

## యశోద

ఏమిటే మీ గొడవ వరువాత?
ఏమి జరిగెనో చెప్పుడీ వేగ?

తేరగా దొరికాడె నా కొడుకు
దూరకే నిందలన్ మోపగ?
ఊరలేరే? గోప తనయులు
వారి వూసే యెత్తరేమిటి? ..... ఏమిటే?

ఎంత హృదయోల్లాసమో! మీ
కింతులారా! బాలకుండన?
ఎంత ప్రేముడి ముదులు వడెనే
వింత వింత పదాల మాటున? ..... ఏమిటే?

ఒక్కడే నా కొడు కన్ని నేరాల్
చక్కబెట్టెడి జాణ యందుర?
ఉల్లములలో నున్న దేదో!
కల్లకపటము లాడుచుంటిరి. ..... ఏమిటే?

ఏమి చేసెనో చెప్పకుండా
ఏమి టీ నీలాపనిందలు?
ఏటికే నా కొడుకుపై ఈ
లాటి నిందలు? ములుకు పలుకులు. ..... ఏమిటే?

నేరములు మోపంగ వేరే
లేరె గోపకుమారు లెందరో?
ఊరకే మీ యుబుసుపోకకు
తేరగా నా దొరే దొరకెనె?

నను గన్న తండ్రీ! గారాల కూచీ!!
భాగ్యాల పంటా! పుణ్యాల రాశీ!
వరహాల మూటా! రత్నాల హారం!
వజ్రాల పేరూ, చైతన్యమూర్తీ!!
ఏమొనర్చెనో చెప్పడీ వేగ?

## గోపికలు - ఒక్కొక్కరు

ఏమి చేసెనో నీకుమార
స్వామి కథలిక చెప్పమందువ?
చెప్పెదము చెవులార వినుమీ
చుప్పనాతితనమ్ము లేదే,
ఓ యశోదమ్మా. ... బలే బలే బలె బలె

చల్ల చేస్తూ వొంగినప్పుడు
పిల్లి లాగా వచ్చి లోనికి
వీపుపై కెగబ్రాకి వేగమె
ఏపుగా ముద్దాడి చనెనే!
సిగ్గౌను చెప్పగ. ... బల్ బలే బలె బ

వెన్న దొంగిలి మెక్కి మెక్కి
తిన్నగా పోకుండ పిల్లదు
పులిమి పోయెనె మూతినిండా
తులువ నన్నే దొంగ చేసెను!!
బాధౌను చెప్పగ. ... బల్ బలే బలె బ

ఎరుగకుండా ఇంటిలోబడి
పెరుగు దుత్తలు వెతకుతుంటే
పట్టుకొని ప్రశ్నింప, దూడలు
నెట్టుకొని లోదూరె నంటదు!! ... బల్ బలే బలె బ

దూడ మేతకు పూర్వ మెవడో
తాడి చె ట్టెగబ్రాకె నందురు;
దూడలకు నిల్లిల్లు వెతకే
ప్రోడ నీ కొడు కోయశోదా! ... బల్ బలే బలె బ

జంకు కొంకూ లేని పిల్లదు
వంకలన్నీ తానె తిరుగును;
ఊరి మూకల జేర్చి మాపై
పోరు సల్పగ వచ్చిపడునే! ... బల్ బలే బలె బ

ఒళ్లు మరచీ నిద్రపోతే
కాళ్లుసేతులు కట్టి గట్టిగ
గండుచీమలు పంపినా డీ
రెండు చెవులను నీ కుమారుడు. ... బల్ బలే బలె బలె

అత్త పక్కనె, మగడు లేడని
ఒత్తిగిలి నే పండుకొంటే
వచ్చె మగడని చెప్పి వేగమె
తెచ్చెనే నన్ పడక టింటికి!! ... బల్ బలే బలె బలె

చల్ల లమ్మగ పోతుంటే
మెల్లగా నా కొంగు లాగి
చల్ల లమ్మితె వచ్చు సొమ్మది
యెల్ల తానే యిస్త రమ్మను!! ... బల్ బలే బలె బలె

కోక లిమ్మని గోల చేస్తాడు
ఇవ్వక పోతే
కోక లపహరిస్త నంటాడు;
కోక లిస్తే లేని వారికి
కోక లిస్తా నంట డేమిటి? ... బల్ బలే బలె బలె

పాలు పెరుగులు అమ్మవద్దని
ఏలకో శాసిస్త డీతడు?
పాలు పెరుగులు అమ్మకుంటే
ఎలా బ్రదుకులు తెల్లవారును?
మా కెలా బ్రదుకులు తెల్లవారును?

వెన్నముద్దలు నిల్వచేస్తే
వెన్నుడూ కోపిస్త డంటడు;
బాలకుడు మనపాలి శ్రీగతి
ఏలికైనా డేమిటమ్మా!
ఓ యశోదమ్మా! ... బల్ బలే బలె బ

మాయలాడే నీ కొమారు డ
మాయికపు పిల్లలా చేర్చి
నాయకుణ్ణని చెప్పి గొప్పగ
రేయి పవ లిల్లిల్లు దోచును. ... బల్ బలే బలె బ

యశోద

చాలు చాలీ కల్ల పల్కులు
నాలుకలకు నరాలు లేవే!
కట్టితిని యీ కంబమునకే
పట్టి యేగతి తిరుగు నిల్లిల్లు.
బల్ బలే బలె బలె
బలే మాటలు నేర్చిరీవేళ
ఈ గోప కాంతలు
బలే కథలే అల్లుతారమ్మ!

అపుడీ నేరాల నీగతి
మోపకుడి నా కన్నపై నిక
భద్రముగ రాత్రంత ప్రక్కనె
నిద్రవోయెను నా కుమారుడు. ... బల్ బలే బలె బ

కల్ల మాటలు కట్టివెట్టుడి
చిల్లివడె నా చెవులు వినవిక;
ఆడిపోసికొనంగ పాపని
పాడియా? బిడ్డలను కనరా? ... బల్ బలే బలె బలె

పిల్లడే యని కనికరింపక
అల్లరులు గోరంతలైనా
అల్లెదరు కొండంత కథలుగ
ఉల్ల ముల్లాసమ్ము చెందగ. ... బల్ బలే బలె బలె

లేక లేక జనించె పాపడు
మీ కిదేల యసూయ మాపై?
అతని యూసే పోసుకొను మీ
కుతకమును చాలింపు డికపై. ... బల్ బలే బలె బలె

బుద్ధిమంతుడు నా కుమారుడు
ఉద్ధరించు జగాల నన్నిటి;
చిన్ని నాన్నకు పాలు కరవే?
వెన్నముద్దలు లేవె మాకడ? ... బల్ బలే బలె బలె

పొరుగు కొంపల పాలు పెరుగుకు
పరుగులెత్తు దరిద్రు డందురె?
దొంగ యందురె బాలకుని ఓ
యంగనలు! మీ నోళ్లు నొవ్వగ. ... బల్ బలే బలె బలె

లేచి రండీ యర్ధరాతిరి
చూచెదరు నా బిడ్డ సరసన;
దొంగ యందురా? దొరే యందురో?
అంగనలు! మీ జాణతనమది. ... బల్ బలే బలె

పొండి పొండిక, కొంపలకు, రా
రండి రండిక, క్రొత్త కథలను
ఏపుగా వర్లింప నేర్తురు
రేపకడనే! గోపకాంతలు!! ... బల్ బలే బలె

గోపిక లొక్కొక్కరు

పంకజాక్షి! తొందరేటికి?
ఇంక గల వెన్నెన్నొ గాథలు!
నోరు నొవ్వగ నుడివెదము, మన
సార విని సంతోష మందుమ. ... బల్ బలే బలె

పొల్లు పలు కొకటైన లేదివి
యెల్ల సత్యములో యశోదా!
ఆలకింపుము, ఒట్టు, అన్నల
ఆలమందల మీద, నమ్మిక. ... బల్ బలే బలె

తల్లి చాటు కుమారుడని, మే
మెల్ల నోళ్లు బిగించు కొంటిమి,
తెల్లమాయె, నితండు గడుసరి
కల్లకపటపు మాయదారని. .... బల్ బలే బలె

పిల్లడని మే మూరకుంటే
ఉల్లములనే దోచుకొంటడు;
తల్లి! నీవిక మిన్నకుంటే
కొల్లగొట్టు జగాల నన్నిటి. ... బల్ బలే బలె బలె

తనవియే యీ యంద రిండ్లని
చనువుగా తిరుగాడుతాడే!
ఉట్లపై గల నేతి యరిసెలు
ఎట్లొ దొంగిలి పరువు లెత్తును. ... బల్ బలే బలె బలె

అరుస్తుంటే దొంగ దొంగని
అరిసె ముక్కలు నోట తురుమగ
అత్త నన్నే దొంగయని, చే
మొత్తెనే, చీవాట్లు వెట్టెనె!! ... బల్ బలే బలె బలె

అత్త మామ లెఱుంగ నట్లుగ
సొత్తు నొకచో దాచుకొన ఆ
గుట్టు నీతదు నెమ్మదిగ పసి
గట్టి యేరాల్ ఛెవిని ఊదెను!! ... బల్ బలే బలె బలె

ఆలు మగలకు మధ్యగల భే
దాల నీతదు తీర్చు నేర్పరి;
రతులలో మర్మాల నన్నీ
మతి చలింప వచించు గడుసరి. ... బల్ బలే బలె బలె

తానె విద్యల నంత మెరిగిన
జాణనని యేమేమొ పల్కును;
వెనుక జన్మల కథలు సెప్పెద
తనివి తీరగ కౌగిలిమ్మను. ... బల్ బలే బలె

తన్నె భర్తగ నెమ్మనమ్మున
నెన్నుకొనుమని బోధ సేయును;
భర్త గలడన; అందరికి తా
భర్త నంటాడేమి చోద్యము!! ... బల్ బలే బలె

'కృష్ణ!' 'కృష్ణా!!' యన్న జీవుల
తృష్ణ పూర్తిగ తీరు ననునే!
విష్ణువన వేరెవరు? తానే
విష్ణు వీశ్వరు డని వచించును. ... బల్ బలే బలె

ఇతడు నను కౌగిలికి జేర్పగ
మతి మహాద్భుతమగు విచిత్రము;
పూర్వజన్మ తపస్విగా నే
నిర్వికారానంద మందితి. ... బల్ బలే బలె

గట్టిగా తను నమ్మి కొల్చిన
ఎట్టి యాపద రాదు మాకను;
అమ్మొ! యితడు మహేంద్రు డగునా?
బ్రహ్మ విష్ణు మహేశ్వరుండా? ... బల్ బలే బలె

కొండ కోనల నుండి పిలిచెద
రండి నడిరేయైన నేమగు?
అండగా తానున్నా ననునె?
దండనలు తప్పింపగలడే? ... బల్ బలే బలె బలె

గుప్తదానము సేయు వారికి
ప్రాప్తమష్టైశ్వర్య మనునే!
గుప్తదాన విధాన మడిగిన
చెప్తనని చెవి కొరికి పోవును. ... బల్ బలే బలె బలె

గుట్టుగా నోమూల తానం
బెట్టులో చేస్తుండ వచ్చి
చేతి చెంగటి చెంబు నెత్తుకు
పోత డీపూతనా ఘాతుడు!! ... బల్ బలే బలె బలె

వేరే దేవు ళ్లెవ్వ రైనా
కారు తనకిల సాటి మేటిగ!!
తానె యందరి కన్న మిన్నని
మానమంటా డన్య భజనము. ... బల్ బలే బలె బలె

హద్దు మీరెడి బాలకునిపై
ముద్దు ముచ్చట లెల్ల చెల్లెను;
కట్టు మీ రోటి కి బాలకు
గట్టిగా ముప్పేట త్రాళ్లను. ... బల్ బలే బలె బలె

## యశోద

క్లల మాటలు కట్టిపెట్టుడి
చల్లలమ్మ ప్రొద్దు పైవడె;
ఒట్లు వారా రేటికే! యి
క్కట్ల పాలగునేమొ జన్మలు.

లే దబద్ధము లేశమైనా
నాదు వాక్కుల సకియలారా!
రాతి రంతయు నన్ను విడువక
నా తనూజుడు నిద్రవోయెను.

లోన బయటను నుండ నితడే
మైన భగవంతుండ చెప్పడి?
ఏమిటే యీ కాలయాపన?
క్షేమముగ పోపొండి యిండ్లకు.

ఇంత సంచలనాత్మకుడు మన
చెంత నుండుట మహాభాగ్యము!
భేద మితనికి లేదు మనపై
ఆదరించును ప్రేమ నందరి.

పాడుకొనుడి కుమారకునితో
ఆడుకొనుడీ య్యాట లెన్నో!
కట్టిపెట్టుడి మనోల్లాసము
పట్టిపై నేరాలు మోపగ.

కన్న యింటికి వచ్చినంతనె
వెన్నదుత్తలు దాచకుండా
మున్నె యాతని ముందు పెట్టుడి!
వెన్న ధర చెల్లింతు నేనే!!

ఆతడే నవనీత హృదయుడు
ఆతనికి మీ వెన్న లేటికి?
ఆతడే క్షీరాబ్ధి శయనుడు
ఆతతానందాబ్ధి చంద్రుడు.

ఎంత పుణ్యము చేసికొంటిరొ
ఇంతులారా! యితని చెలిమికి;
ఎప్పుడును మీ యిండ్లచుట్టును
అప్పు తీర్చుకొనంగ తిరుగును.

ఒక్కక్షణమే నింటిపట్టున
చక్కగా నిలుచుండి యెరుగడు;
ఇతని యరికాళ్లలో చక్రా
లతికెనేమో చూచి చెప్పుడి.

ఆలమందల నిచ్చి పంపెద
తోలుకొను రేపులును మాపులు;
వేయి కట్టెద కాళ్లు త్రాళ్లను
హాయిగా నిద్రింపు డికపై.

# సమాహ్లాదం

## ఎందు కింత ఆలస్యము?

వెదురు పొదను చిరుగడకా
వొదవె నింత యదృష్టమ్ము?
నాథు నధర సీమ జేరి
నాద సుధలు విరజిమ్మును? ..... వెదురు

వివిధ వేణు నాదములను
వినలేదా పూర్వమందు?
ఈ వేణువు కింత శక్తి
ఏ విధముగ సంప్రాప్తము? ..... వెదురు

నాథు డూదు ప్రాణ వాయు
మాధుర్యమె మారుమ్రోగు!
పురుషోత్తము పరమాద్భుత
పారమ్యము పరగు నిట్లు!! ..... వెదురు

ఘనతర మీ నినాదములు
ఘన గతులను స్థంభించును;
బ్రహ్మదేవు నంతవాని
బొమ్మగ గావింపగలవు!! ..... వెదురు

తుంబుర నారద వితతికి
దంబు రూపు మాపగలవు;
సకల చరాచర సృష్టికి
వికాసమ్ము సంతరించు! ..... వెదురు

లోకాలోకము లంతట
ప్రకటిత మీ నాద మహిమ;
పరవశించి యనంతుండు
శిరసు నూపునేమొ చెలీ!! ..... వెదురు

మీ చెవులకు సోకలేదె
ఈ చిన్మయ చైతన్యము?
ఎల్ల ప్రకృతి యొక్కుమ్మడి
ఉల్లసిల్లు పులకితమై!! ..... వెదురు

కాదా యిది ఆహ్వానము?
కాదా తరణోపాయము?
ఎంత మంచి అవకాశము
ఇంత త్వరగ సంప్రాప్తము? ..... వెదురు

వేదాలను చదవలేదు
వాదాలను నేర్వలేదు;
ముక్కు మూసుకొని యొకచో
చక్కగ కూర్చొన జాలము! ..... వెదురు

ఎందుకింత ఆలస్యము?
బృందావన మధిగమింప!
సుందరుడా జగన్నాథు
నందర మొకపరి కొల్వగ? ..... వెదురు

ఈ తనువులు వేణువులుగ
చేతము వేవేగ రండు!
నూతనమౌ నాదసుధా
స్రోతస్సులు పొంగిపొరల!! ..... వెదురు

చెలులారా! లేచి రండు
కలతల్లెల్ల మాపిగొనగ!
చేరి చిన్నికృష్ణునితో
చరియింపగ తరుణ మిదే!! ..... వెదురు

బృందావన సీమలలో
అందరమును చుట్టుముట్టి
బాలకుతో హాయి రాస
లీలలెన్నొ సాగింతము. ..... వెదురు

ఇతని గూడి ఆడుకొనుటె
అతివలార! మన భాగ్యము;
ఇతని తోడ నర్తించుట
అతి సద్గతి ఈ జన్మకు. ..... వెదురు

ఎందుకింత ఆలస్యము?
సుందర చైతన్యాకృతి
వేణువూది పిల్చినంత
మేనులు పులకింపలేదె? ..... వెదురు

## ఊదకురా వేణు వింక!!

ఊదకురా వేణువింక
వేదన భరియింపజాల;
ఆదరమున నీ యెదపై
సేద దీర్పరా కృష్ణా!! ..... ఊదకురా

వేణురవ మొకింత సోక
నానాడులు క్రక్కదలును;
జన్మజన్మముల వాసన
లున్మీలిత మొక్కుమ్మడి! ..... ఊదకురా

ఆగలేక పోతి నింక
వేగ మతిశయించె లోన
ఛేదించితి బంధాలను
పాదాబ్జమ్ములు పట్టితి!! ..... ఊదకురా

ఈ జీవుని వేదనాగ్ని
విజృంభించి దహియించెదు;
నీ శీతల దృక్పూరము
చే శమింపజేయు ప్రభూ! ..... ఊదకురా

కొండ కోన లెన్నో దాటి
అండ జేరినాను స్వామి!
దండించిన కదల మెదల
ఉండనిమ్ము నీ యుండను! ..... ఊదకురా

ఎన్ని జన్మ లెత్తితినో!
ఎన్ని నోము లొనరించితి?
అన్నీ సఫలమ్ము లాయె
ఇన్నాళ్ళకు నీ సన్నిధి!! ..... ఊదకురా

నీ కన్నుల వెన్నెల నా
కను కల్వల విరియ నిమ్ము!
నీ యధరామృత ధారలు
నాయాకలి తీరనిమ్ము!! ..... ఊదకురా

నీ దివ్యప్రకృతిలోన
ఇదే ప్రవేశింతు నాథ!
పాత రోత రూపు మాపి
పూత మొనర్చెద పుట్టుక! ..... ఊదకురా

రస విహీన జీవితమ్ము
రసోజ్జ్వలిత మొనరింపుము;
మృణ్మయమగు నింద్రియముల
చిన్మయ మొనరింపు స్వామి!! ..... ఊదకురా

ఒక్కసారి నిను కౌగిలి
చక్క నొత్తనిమ్ము కృష్ణ!
నా తనువుకు నూత్నశక్తి
పాతమోద మొనరింపుము! ..... ఊదకురా

వెన్న దొంగిలించితి వని
కన్ను రెట్టి జేసినాను;
వెన్న లారగింపకున్న
కన్నా! యెదమెత్తగిలునె? ..... ఊదకురా

నీవను సంసారములో
ప్రవేశింపనిమ్ము నాథ!
నూత్న నూత్న మనుభవాలు
చేతము నుప్పొంగనిమ్ము!! ..... ఊదకురా

నాదను భావము వీడితి
నీదే యీ సర్వస్వము;
నీవే నావాడ వనెడి
భావము మాత్రము వీడను!! ..... ఊదకురా

నీ కన్నను నా కెవ్వరు
ఓ కన్నా! లేరు దిక్కు;
నీదే యీ దీనురాలు
ఆదుకొనుము శీఘ్రగతిని. ..... ఊదకురా

నిఖిల రసామృత మూర్తీ!
అఖిల నయితి నీ సన్నిధి;
సకల నయితి కళానిధీ!
ఇక సమైక్య మందనిమ్ము. ..... ఊదకురా

ఊదుద మిక నీ వేణువు
మేదిని పులకించిపోవ
బృందావనముగ మారగ
అందాలను ఆచికొనగ. ..... ఊదకురా

## జీవిత వికాసం

నీవు లేని నా పుట్టుక
తావి లేని పూవు ప్రభూ!
నేను లేక నీ యునికికి
కానబడదు వికాసమ్ము.

నిన్నన్వేషించు కొరకె
నన్ను మనిషి నొనర్చితివి!
నిన్ను విస్మరించుటందె
మిన్నుముట్టె నా మనీష.

దివ్యత్వము ననుభవింప
భవ్య హృదయ మిచ్చినావు;
దాని కించపరచుటందె
నా నైపుణ్యము నెరపుదు.

నీ చిత్కళ ననుభవింప
రచియించితి వింద్రియాళి;
క్షుద్ర విషయ సంసక్తిని
భద్రత కోల్పోయె నవియు.

నా యింద్రియ వితతి సతము
నీయం దనురక్త మగుత!
నీ చింతన మందె బుద్ధి
రోచింపగ నిమ్ము స్వామి!

నీ యనుభూతి విభూతిని
నా యెదంద మేల్కాంచుత!
నీ యన్వేషణ మనీష
నాయందతి నిశిత మగుత!

నా యెడంద, నా మనీష
నా యింద్రియ సర్వస్వము
నీ సేవా పరతంత్ర వి
కాసిత మొనరింపు కృష్ణ!!

నాలో నీ యునికి నెపుడు
ఆలోచన చేయనిమ్ము;
నీ యందము నీ చందము
నాయం దావిష్కరించు.

నీ పదచిహ్నము లెప్పుడు
నా పనిలో కాంచనిమ్ము;
నీ వేణువు నా మదిలో
ఆవేదన తీర్చనిమ్ము.

నీలో నను జేర్చుకొనక
నాలో నీవే స్థిరపడు;
నేనంటే నీవే, అను
మానము రానీకు మయ్య!

## జీవిత నౌక

ఈ జీవిత నౌక కీవె
ఆజీవిత కర్ణధారి;
దాని గమ్య మెచ్చటికో
నే నెరుంగ గిరిధారీ!!

గమ్యమేదొ నిర్ణయించి
రమ్య మొనర్పుము గమనము;
ధన్యమగును నా జన్మము
మాన్యమగును నా మనుడగ.

కల్లోలాంబుధిలో బడి
తల్లడిల్లు బ్రదుకు నావ;
దాని నుద్ధరింప చేత
గాసిదాన నో నాథా!

నా విధి నిర్ణేత నేనె
నా వశమే సర్వమంచు
కన్ను మిన్ను గానకుండ
తన్నుకొందు గర్వమతిని.

అహంకార భావవితతి
దహియింపుమనాథ నాథ!
దాసోహాంజలి బద్ధుడ
ఆసక్తిని చేకూర్పుము!

అందదుకులతో గూడగ
పొందిక కోల్పోయె నావ;
ఏ విధి యాత్రాయోగము
కావించెదవో! నావిక!

కర్ణధారి వీవుండగ
నిర్ణయాలు నాకేటికి?
తెరచాపెత్తించి నౌక
పరువులెత్త నిమ్మికైన.

ఎదురు ప్రయాణా లొనర్చి
చెదరిపోయె నా ధైర్యము;
శేష జీవితమ్ము నిక పి
శేష గతుల నడిపింపుము.

తెరచాపెత్తుము వేగమె
పరమ సౌఖ్యపదము చేర;
ఈ జీవితనౌక కివె
ఆజీవిత కర్ణధారి.

## పరిహరింపకు కృష్ణ!

పరుగు పరుగున వచ్చి
పాదాలపై బడితి
పరువు కాదని నన్ను
పరిహరింపకు కృష్ణ!!

నీకె బరువైనచో
నాకు దిక్కెవరింక?
శరణు సొచ్చితి నిన్నె
కరుణా సముద్రుడా!!

కరి పంకజము వట్టు
కరణి గోవర్ధనము
పెరికి పైకెత్తితివి
బరువు నీ కెట్లాదు?

అత్త మామల నట్టె
ఒత్తిగల చేసితిని;
బావ మరదుల నెల్ల
త్రోవ తొలగించితిని.

మగని ఆక్రోశమ్ము
సగములో త్రుంచితిని
పోరాదు యేరాలు
బీర మణగించితిని.

ఎంత శ్రమ కోర్చితినో
చెంత కరుదెంచుటకు?
ఇంతిపై కరుణించి
వంత దీర్పుము కృష్ణ!

నీ పిలుపె నా కింత
ప్రాపు చేకూర్చినది;
ఓ ప్రియుడ! నీతోనె
కాపురము నాకింక.

పిలిచి పో పొమ్మన్న
కలత చెందదె మనసు?
నెలత నీరీతిగా
చులకనగ చూతువా?

"బొట్టు కాటుక నీకు
పెట్టి నే పిలిచితినె"
అని వచింపకు నాథ!
ధ్వని నే నెరుంగనా?

## వాసిగాంచు మన వర్తన

"ఇల్లు విడిచి, పొలము దాటి
ఇల్లాండ్రిటు రాజెల్లునె?
మగువలకీ సాహసమ్ము
తగునే? యెందైన గలదె?

ఎవరు పిలిచినారు మిమ్ము?
ఎవరు తలచినా రిప్పుడు?
పిలుపని పేరంటానికి
తలతురె పో, మహిళలెందు?

పదియు దాపు గాని వనికి
పనియు నర్ధరాత్రివేళ
మగల సేవ మైమరువక
తగునే యి ట్లన్య భజన?

జాలిగొనియె క్రూర జంతు
జాలము మి మ్మబల లంచు!
మీ ప్రాణముతే పోయిన
నా ప్రాణానికి ముప్పగు.

జారలుగా దిగజారిన
నారీ గౌరవ మేమగు?
చాలు, చాలు పొండి పొండి
కాలూనకు డిచట క్షణము.

పతి సేవకు సాటి మేటి
సతికేమున్నది ధర్మువు?
పతి కన్నను దైవ మొకడు
సతి కన్యము గలదె తలప?

అత్త మామ పరిచర్యలు
ఉత్తమ కర్తవ్యం బగు;
సంసారము ప్రేమ నెరప
సస్పారంబె యగును సుమా!

అదే కదా! స్త్రీలకున్న
అదృష్టమ్ము జన్మతః
భక్తి నెరపుడీ పతులకు
ముక్తి, కరతలామలకము.

నన్ను తలపుడీ గృహమున
నన్ను కొలుచుకొనుడి మదిని
గడప దాటి రాబోకుడి
పడబోకుడి యపనిందలు!

కోడి కూత కూయులోన
కూడి చనుడి మీ గూండ్లకు;
ఆడబడుచులకు శీలమె
వాడిపోని పూల మురువు.

కదలరేమి? మెదలరేమి?
వదలరేమి నా పదములు?
జలజల కన్నీరు కార్చి
కలత వెట్టకండి మనసు.

కామోత్కంఠతతో మీ
రేమేమో వచియింతురు;
లోకము మెచ్చదు మీమీ
వాకులు, చాలింపు డింక.

నేనే నాథుడ నందురు
నేనె యత్తమామ లనగ
నేనే సర్వస్వంబను
మీ నీతి యగోచరమ్ము."

అనుచు కఠిన కీతిని శా
సనమొనర్చు లోకపతికి
అతివలు గద్గద స్వరమున
ప్రతిగ పల్కి రీ రీతిగ :

"పురుషార్థము కన్న మిన్న
పరమార్థం బది లభించె;
పరమ పురుష! పురుషోత్తమ!!
పరమ పదము, నీ పదములె.

నీ సేవయె సకల సేవ
నీ సన్నిధి సర్వోన్నతి;
నల సారము సంసారము
వలదు రోసినాము తండ్రి!

పతుల పతివి, లోకపతివి
అతులిత చైతన్య మతివి,
గతివి నీవె, యేదు గడవు
గతము విస్మరించినాము.

నీ తోడిదె మా లోకము
నీతోనే మా బ్రతుకులు;
ఇదె పో, సాలోక్యంబన
ఇదే యిదే సామీప్యము.

ఇయ్యదియే సారూప్యము
ఇయ్యది సాయుజ్యంబగు"
అనెడి వెఱ్ఱి వనితలపై
కనికరించి కృష్ణు డనియె :

"ఆడుకొనుడు, పాడుకొనుడి
వేడుక లవి తీర్చుకొనుడు;
ఎంత తపించితి రబలలు?
ఎంత సాహసించినారొ?

మీ మధ్యను నన్ను నిల్పి
నా మధ్యను బంధింపుడి!
శక్తి పాత మొనరించెద
రక్తిగాంచు మీ జన్మలు.

మీ మనస్సు రంజిల్లగ
కామోత్కంఠత తీరగ
రాసలీల కావింతము
వాసిగాంచు మన వర్తన.

మీ రందరు నా ఆత్మలె
వేరెవ్వరు లేరు నాకు;
మీతో నే నాడుటన్న
నాతో నే నాడుకొనుటె.

మీ బత్తిని పరీక్షింప
నే బల్కితి కఠినముగా;
నే దాసుడ మీ కందర
కాదరింపు డీ సేవలు."

## నాకు మరణము లేదు

ఈ వేణు రవము నా
జీవ నాడుల జొచ్చి
కదలించి వేవేగ
కదలి రమ్మంటుంది. ..... ఈ వేణు

ఈ మురళి నాదమ్ము
నా మదిని మార్మ్రోగి
ఏమొ చెప్పగ రాని
కామ ముత్కంఠించు. ..... ఈ వేణు

ఆలకించిన కొలది
ఆలోచనలు పెంచు;
జన్మజన్మల వాస
నల్మదిని ప్రేరేచు. ..... ఈ వేణు

ఒడలంత పులకించు
తడబాటు నొదవించు;
తడి చేరు గళములో
ఒడి నిండు కన్నీరు. ..... ఈ వేణు

కన్నయ్య ప్రేమతో
నన్ను ఆహ్వానించు
చున్నాడు తన దరికి;
మన్నింప కెట్లుందు? ..... ఈ వేణు

ఏ జన్మలో తపమొ
ఈ జన్మలో పండె!
పురుషార్థ మీరీతి
పరమార్థ మొదవించు. ..... ఈ వేణు

త్వర త్వరగ పనులెల్ల
సరిదిద్దుకోవాలి;
మతి సంభ్రమముచేత
గతి తప్పి చరియించు. ..... ఈ వేణు

ఆపుకోలేకుంటి
ఈ పారవశ్యమ్ము!
నా యత్న మంతయు వృ
ధాయాస మనిపించు. ..... ఈ వేణు

విడిచి దూడను లాగ
తడ వెంతొ చేసితిని;
పాలు పితకా లింక
పాలు మాలిక లేక. ..... ఈ వేణు

పొయి మీద పాలన్నె
పోయె పొంగులువారి;
చాలునో చాలవో
పాలు పతి పుత్త్రిలకు? ..... ఈ వేణు

ఉస్సు రస్సురు మంచు
నిస్సార సంసార
మెన్నాళ్లు వేగింతు?
కన్న కరుణించె నిదె. ..... ఈ వేణు

వేణురవ మార్గాన
ప్రాణనాథుని జేరి
చరణములపై వ్రాలి
శరణు సొచ్చెద నింక. ..... ఈ వేణు

అత్తడ్డమై రాగ
ఒత్తిగిల జేసెదను;
మామగారిని తగిన
సామమున మరలింతు. ..... ఈ వేణు

తప్పుకొమ్మని మరిది
నొప్పింతు మెల్లగా;
భర్త చేజేసికొన
వర్తింతు కఠినముగ. ..... ఈ వేణు

ఊ రేకమై రాగ
పోరు సల్పెద గాని
క్షణమైన నిట నాగ
మనసు పదిలము గాదు. ..... ఈ వేణు

పతి సేవలోనె జీ
విత మంత సాగినది;
పతులకే పతిగ శ్రీ
పతిని భజియింతు నిక. ..... ఈ వేణు

అతిలోక సౌందర్య
మతినె ఆరాధింతు;
సతత శివ సుందరా
కృతికి సత్కృతి గూర్తు. ..... ఈ వేణు

బాలు డాకర్షించి
ఆలింగనము సేయ
నాలోని చిచ్ఛక్తి
లీలగా పైకెగయు. ..... ఈ వేణు

రాస నృత్తము సేసి
నేసమున్నతి గాంతు;
నాకింక జరలేదు
నాకు మరణము లేదు. ..... ఈ వేణు

ఇదె నాదు సామీప్య
మిదియె సాలోక్యమ్ము
ఇదియె పో సారూప్య
మిదియె సాయుజ్యమ్ము. ..... ఈ వేణు

లోక మేమనుకున్న
నాకేటి భయమింక?
ఎన్నాళ్ళు గడుపుదును
ఇన్నీరసపు బ్రదుకు? ..... ఈ వేణు

ఇన్నాళ్ల కిరీతి
కన్నయ్య మూలాన
వాదించి బంధాలు
ఛేదింప గల్గితిని. ..... ఈ వేణు

ఎవ్వ రేమనుకొన్న
నొవ్వ నేమాత్రమ్ము;
ఔన్నత్య సాధనకు
అన్ని యవరోధాలె. ..... ఈ వేణు

బలిమి కలి మీరీతి
కలిగె వేణువు వలన
ఋణపడ్డ దీబ్రదుకు
అణువణువు వేణువుకు. ..... ఈ వేణు

ఓ వేణునాదమా!
నీవె నా ప్రాణమ్ము;
నాకు నీ భాగ్యమ్ము
చేకూర్పు, వందింతు. ..... ఈ వేణు

## ఆకాంక్ష

ఆపలేక నా ప్రేముడి
గోపిక నేతెంచినాను;
ఈ యెడంద బృందావని
నీయాటల వికసించును.

చేయజాల నే తపమ్ము
చేయజాల నే జపమ్ము
పట్టువట్టి పూజరేవి
గట్టిగ తలపెట్టజాల.

అలరుల తగనేర్చి కూర్చి
అలంకృతు లొనర్పజాల;
నీయాలయ సమ్మార్జన
కాయత్తము కాదు మనసు.

ఈ పుట్టుక ఏ రీతిని
చేపట్టునొ సద్గతి నిక?
నీ పుట్టిన చోటు కన్న
నా పట్టిది కాదు మిన్న!!

నీకు నాకు గల బంధము
ఈ కరణి సమన్వితమ్ము;
నా కాంక్షను దీర్పగలదు
నీ కటాక్ష వీక్షణమ్ము.

చదువు లేని మొద్దు నేను
పదును లేని బుద్ధి నాది;
అత్యుత్కట మగు కామము
ప్రత్యుద్గత మీ తనువున.

నీ కౌగిలిచేత గాని
ఈ కామము శమియింపదు;
లోకమేమి యనుకొన్నను
నాకెట్టి కొరంత లేదు.

నీ సేవా పరతంత్రత
నే సుశీల నౌదు స్వామి!
నీ కౌగిలి గాఢతచే
నా కొదవును దివ్యత్వము.

ఇదే కదా! యోగ మహిమ!
ఇదే సత్య తపోగరిమ!!
ఇదే భక్తి సుఖ చారిమ!
ఇదే రాగ భోగ పటిమ!!

## హృదయ వీణ

శ్రుతి చేసి యీ హృదయ
వీణ మీటుము కృష్ణ!
గతు లెన్నొ పలికించి
సద్గతిని గూర్చుమా!! ..... శ్రుతి చేసి

వేణు వూదకు మింక
ప్రాణాలు పిండకుము;
ఈ వేణు వాధిక్య
మే జీవునకు లేదు. ..... శ్రుతి చేసి

అధరామృతం బొక్క
చుక్క మిగిలింపకే
డొక్క నిండుగ త్రాగి
నిక్కి నీలుగు చుండె. ..... శ్రుతి చేసి

సుంత ఈ వేణువున
కింత సౌభాగ్యమా?
యోగీశ్వరుల కేని
యోగ మిట్లబ్బునా? ..... శ్రుతి చేసి

ఒక్కొక్క ఈ జీవ
నాడి గట్టిగ బట్టి
నొక్కి సంగతులచే
చొక్క సేయుము స్వామి!! ..... శ్రుతి చేసి

హృదయ తంత్రులలోన
నొదిగె మహితార్థముల్;
మేటి వైణిక! వీణ
మీటుమా! దీటుగా!! ..... శ్రుతి చేసి

ఈ వీణ గుండెలో
జీవ వేదన నిండె;
నీవె పలికింపుమా
ఆవేదనము తీర. ..... శ్రుతి చేసి

శ్రుతి సేయగా లేని
మతి విహీనను నేను;
శ్రుతి పరిజ్ఞాన వి
శ్రుత కీర్తి వీవెరా!! ..... శ్రుతి చేసి

వీణలో నీవెంత
జాణవో! నే నెరుగ;
నారదాదులు చెప్ప
గా రహస్యము వింటి. ..... శ్రుతి చేసి

సకల కళలకు నీవె
నికషోపలమ్ము రా!
ఈ వీణ చేపట్టి
ప్రావీణ్యముమ జూపు. ..... శ్రుతి చేసి

## ఉడుగర నీ కీ బ్రదుకులు!

వెతకి వెతకి వేసారితి
సతమత మైతిమి కృష్ణా!
వెతబెట్టకింక మమ్ము
బ్రతిమాలెద కనికరింపు. ..... వెతకి వెతకి

పొదల దూరబోకు కన్న!
వెదకములేే, నల్లనయ్య!!
పొదల మాటు పులులుండును
పదిల మింక నీ ప్రాణము. ..... వెతకి వెతకి

ఎంతని యీ విరహ తాప
మింతులు సహియింప గలరు?
సుంత కరుణ సూపు ప్రభూ!
స్వాంతము శాంతింప నిమ్ము. ..... వెతకి వెతకి

కాగి కాగి యీ యెడదలు
రేగిపోవు కొలిమి లట్లు;
క్షణము నాలసించితేని
కనవు మాదు ప్రాణాలను. ..... వెతకి వెతకి

నీ జాడలు కనజాలక
ఈ జంతువు లేడ్చుచుండె;
సుంత జాలి తిలకింపుము
సంతత కరుణార్ద్ర హృదయ! ..... వెతకి వెతకి

నిన్ను గనక ఈ చంద్రుడు
వన్నె దరిగి వెలవెలగను;
ఖగ మృగములు నీ కొరకై
మొగములెత్తి మొత్తుకొనును. ..... వెతకి వెతకి

బృందావన వీధులలో
అందమెల్ల అంతరించె;
నీవు లేక మొలకలేవి
త్రావ నొక్క నీటి చుక్క. ..... వెతకి వెతకి

అణువణువున నొక్కమారు
నన లెత్తగ చైతన్యము
వేణువు పూరింపు కృష్ణ!
ప్రాణభిక్ష నర్థింతుము!! ..... వెతకి వెతకి

అడుగు తీసి అడుగు వేయ
తడబడుచుంటిమి నాథా!
తడవేటికి మమ్ము జేర?
ఉడుగర నీ కి బ్రదుకులు. ..... వెతకి వెతకి

## జీవితేచ్ఛ

ఉన్నవాడ వున్నట్లే
కన్ను కప్పి మాయమైతి;
వెన్నదొంగ వనుకొంటిమి
అన్నిట పరిపూర్ణుడవే!! ..... ఉన్నవాడ

నిన్ను వెతకి పట్టలేము
కన్నా! మము జాలిగొనుము;
వెన్న నివేదింతుము, ప్ర
సన్నుడ వగమో కృష్ణా!! ..... ఉన్నవాడ

పొదల ముండ్ల చిక్కువడిన
వదలింపగ మా తరమా?
పంతాలకు పోకు మింక
వంతల మము ముంచబోకు!! ..... ఉన్నవాడ

ఇల్లువీడి యేతెంచిన
ఇల్లాండ్రను లాలింపక
కల్లకపట నాటకాల
అల్లరితన మేల నీకు? ..... ఉన్నవాడ

ఇంటికేగ కాళ్లు రావు
ఒంటిగ నిల్వంగలేము;
రెంటికి చెడు రేవండ్లగ
ఉంట నీకు సమ్మతమా? ..... ఉన్నవాడ

నీ తోడిదె లోకంగా
చేతోమోద మెలర్పగ
జీవించే సౌభాగ్యము
నీవె త్రోసిపుచ్చ తగునె? ..... ఉన్నవాడ

నీ చెలిమికి నోచుకోని
మా చెలువము చిన్నవోవు;
నీతో ఆటల పాటల
మా తను లత పూయనిమ్ము. ..... ఉన్నవాడ

వెతకి వెతకి విసిగెత్తెను
బ్రతుకు భారమాయె మాకు;
అన్నిటిలో లీనమైన
నిన్ను బట్ట మా తరమా! ..... ఉన్నవాడ

అటలలో నొప్పుకొందు
మోటమినో చిన్ని కన్న!
పాటలలో నిన్ను మించు
మేటి యీజగాన లేదు. ..... ఉన్నవాడ

అన్నిటిలో నీవేరా
మిన్నవు లోకైకనాథ!
నిన్ను మించ ప్రయత్నించి
మన్ను గరచినా రెందరో!! ..... ఉన్నవాడ

ఇకనైనను బయల్పడుము
సకల కళాజగద్వినుత!
ఒక్క క్షణం బాలసింప
దక్కరు నీకి వనితలు. ..... ఉన్నవాడ

అదిగో మురళీ నినాద
మెద రోతులు కదలించును
మది కలతల నెల్ల మాపి
పదిల పరచు జీవితేచ్ఛ. ..... ఉన్నవాడ

వినిపించును వేణు వెచటొ
కనిపింపవు నల్లనయ్య;
జీవితేచ్ఛ గల్గించిన
ఈ వేణువు మహిమ ఘనము...... ఉన్నవాడ

ఊదినపుడె వినవచ్చును
నాదము, మరి యూదనపుడొ?
లోనాదము వినగల్గే
ధ్యానము కావలె, సాధ్యమ? ..... ఉన్నవాడ

రూపనాద వ్యామోహము
మాపుకొనుట మంచి దింక;
బ్రదుకు నామసంకీర్తన
పదిలపరచుట మంచి దింక. ..... ఉన్నవాడ

# చైతన్య వివృతి

## పుట 1 - గేయం 1

శ్రీమద్భాగవతంలో వ్యాసభగవాను లీ ఘట్టం ఇలా నిరూపించారు : "గోపికలు కూడా యశోదకు జన్మించాడు పుత్త్రుడని విని, ఆనందించి, వస్త్రాలంకార కజ్జ లాదులతో తమ శరీరా లలంకరించుకొన్నారు. అనంతరం మాతన కుంకుమ కింజల్కాలతో, ముఖపద్మాలు శోభిస్తుంటే విశాల నితంబాలతో చలిత స్తనాలతో గోపికలు ఉపహారాలు తీసుకొని, త్వరగా నందగృహం చేరారు. నందగృహం చేరిన గోపికల కర్ణాల్లో కుండలాలు, కంఠాలకు పదకాలు, హస్తాలకు వలయాలు శోభిల్లుతున్నాయి. వారు విచిత్ర వస్త్రాలు ధరించారు. వారి కేశాగ్రాల నుండి పూలమాలలు జారుతున్నాయి. చంచల కుండలాలతో, పయోధరాలతో, హారాలతో శోభిస్తూ వారు మార్గాన పోతూ విరాజిల్లారు." "చిరకాలం రాజుగా ప్రజల్ని పరిపాలించమ"ని వారు ఆశీస్సులిచ్చి, హరిద్రా చూర్ణయుక్తాలు, తైలయుక్తాలయిన జలాలతో బాలుణ్ని అభిషేకించి నుతించారు. (దశమ స్కంధం - పూ.భా. V- 9 నుండి 12 శ్లోకాలు. గాడీయమఠ ప్రచురణ). ఇందులో బాలపరమేశ్వరుణ్ని చూచినప్పుడు గోపికలకు గల్గిన హృదయస్పందనం అభివర్ణితం కాలేదు.

శ్రీమదాంధ్ర మహాభాగవతం (X-పూ.భా. 184-195) లో భాగవతోత్తముడు, పోతనార్యుడిలా అనుసృజించాడు :

ఆ. *ఏమి నోము ఫలమొ, యింత ప్రొద్దొక వార్త*
*వింటి మబలలార! వీను లలర;*
*మన యశోద చిన్ని మగవాని గనెనట*
*చూచివత్త మమ్మ! సుదతులార!!*

వ. అని యొండొరుల లేపికొని, గోపిక లోపికలు లేని చిత్తంబుల నెత్తిన తత్తఱంబు లొత్తుకొన నుదారంబులగు శృంగారంబులతో నిండ్లు వెలువడి

క. *జడగతులను బలు పిఱుదలు*
*వీడి కేడి నడుములును, వలుద బిగి చనుగవలున్*
*వెడద నయనములు సిరి దడ*
*బడ మోములు భ్రమర చికుర భరములు నమరన్.*

ఉ. వేడుకతోడ క్రొమ్ముడుల
వీడఁ గుచోపరిహార రేఖ ల
ల్లాడఁ గపోల పాలికల
హాటక పత్త్రిరుచుల్ వినోదనం
బాడఁ బటాంచలంబు
లసియాడగఁ జేరి యశోద యింటికిన్
జేడియ లేగి చూచి రాగి
జిష్ణుని విష్ణుని జిన్నికృష్ణునిన్.

వ. చూచి సంతసించి, తెచ్చిన కానిక లిచ్చి

తే. పాపనికి నూనెఁ దలయంటి పసుపుఁ బూసి
బోరు కాడించి హరిరక్ష పొమ్ము టంచు
జలము లొకకొన్ని చుట్టి రాజిలగ తొట్ల
నునిచి దీవించి పాడి రయ్యువిద లెల్ల.

క. జోజో కమల దళేక్షణ!
జోజో మృగరాజమధ్య! జోజో కృష్ణా!!
జోజో పల్లవ కర పద!
జోజో పూర్ణేందు వదన! జోజో యనుచున్.

వ. ఇవ్విధంబున

క. పులు తోయంబుల జగములఁ
బలు తోయములందు ముంచి భాసిల్లెడి యా
పలు తోయగాడు, వల్లవ
లలనా కర తోయములఁ జెలంగుచు దడియున్.

క. లోకములు నిదుర వోవగ
జోకొట్టుచు నిదురవోని సుభగుడు రమణుల్
జోకొట్టి పాడ, నిదురం
గైకొను క్రియ నూరకుండెఁ గను దెఱవకయున్.

సీ. ఏ బాము తెలుగక యేపారు మేటికి
పసులకాపరి యింట బాము గలిగె!
నే కర్మములు లేక యెనయు నెక్కటికిని
జాత కర్మంబులు సంభవించె

నే తల్లి చనుబాలు నెఱుగని ప్రోడ
యశోద చన్నుల పాల చొరవ నెఱిగె
నే హాని వృద్ధులు నెఱుగని బ్రహ్మంబు
పొదిగిటిలో వృద్ధిపొందఁజొచ్చె.

ఆ. ఏ తపములనైన నెలమి పండని పంట
వల్లవీ జనముల వాడఁ బండె
నే వదువులనైన నిట్టిట్టి దనరాని
యర్థ మవయవముల నందమొందె.

మ. చెయువుల్ సేయు టజీన్
విధాత కరణిం జెన్నొందు, సంతోష దృ
ష్టి యుతుండై నగుమున్
జనార్దనుని మాడ్కిం బొల్చు, రోషించి యు
న్న యెడన్ రుద్రుని భంగి
నొప్పను, సుఖానందంబునం బొంది, త
న్మయుడై బ్రహ్మము భాతి
బాలు డమరున్, బాహుళ్య బాల్యంబునన్.

ఇది రసోదంచితమైన పోతనగారి యనుసృజన. ఇందులో గోపికల హృద యోల్లాసం, వారి నిగూఢ భక్తి జ్ఞానాలు విదితం. ఇట్టి సృజన ఆధారంగా, స్వేచ్ఛగా స్త్రీలు పాడుకొనే మాత్రాఛందస్సులో ఈ రచన సాగింది. ఈ రసమార్గం ఆంధ్రజాతి కభీష్టం, కేవల కల్పనలకన్న.

## పుట 1 - గేయాలు 3, 4

"శ్రీకృష్ణ సుప్రభాతం" - భక్తిగీతాలు - పుటలు : 12 నుండి 32. శ్రీ గిరిజా ప్రచురణలు, గుంటూరు-6.

ఈ రచనకు ప్రేరణం : శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'ప్రాతఃస్తవము' అనే శీర్షిక. ఇది వారి 'శృంగారవీధి' అనే కావ్యంలోనిది. అతిభాగవత రచన.

## పుట 2 - గేయం 1

అద్భుత శిశువు : శైశవంలోనే అనేకాద్భుతాలు కావించిన శిశువు.

కారాగారంలో దేవకీ వసుదేవులు చూచిన బాలు డీవిధంగా శ్రీమద్భాగవ తంలో (x-iii-9, 10) వర్ణింపబడ్డాడు.

"తమద్భుతం బాలక మంబుజేక్షణం
చతుర్భుజం శంఖ గదాద్యుదాయుధమ్
శ్రీవత్స లక్ష్మం, గల శోభి కౌస్తుభం
పీతామ్బరం సాంద్ర పయోద సౌభగమ్

మహార్హ వైదూర్య కిరీట కుణ్డల
త్విషా పరిష్వక్త సహస్ర కున్తలమ్
ఉద్దామ కాంచ్యఙ్గద కఙ్కణాదిభి
ర్విరోచమానం వసుదేవ ఐక్షత"

'అద్భుతః' అనేది విష్ణు సహస్ర నామాల్లో ఒకటి.

"అనన్తోహుతభుక్ భోక్తా సుఖదోనైక జోఽగ్రజః
అనిర్విణ్ణః సదాఽమర్షీ, లోకాధిష్ఠాన మద్భుతః" (108)

"స్వరూపం, శక్తి, వ్యాపారం, కార్యం - వీటి చేత అద్భుతమైనవాడు కాబట్టి పరమాత్మ అద్భుతశబ్ద వాచ్యుడు". చూ. శ్రీ శంకర గ్రంథరత్నావళి, vii - 359 - 60 పుటలు. సాధనగ్రంథమండలి - తెనాలి.

## పుట 2 - గేయం 5

"సా తస్మిన్ పర(మ)ప్రేమరూపా (2).
యథా వ్రజగోపికానామ్ (21)

నారద భక్తిసూత్రములు · పుటలు 121-122, శ్రీరామకృష్ణ మఠం - మద్రాసు, 1971.

## పుట 5 - గేయం 4

"కూజన్తం రామ రామేతి, మధురం, మధురాక్షరమ్
ఆరుహ్య కవితా శాఖాం, వందే వాల్మీకి కోకిలమ్"

## పుట 6 - గేయం 1

"నిగమ కల్పతరోర్గళితం ఫలం
శుకముఖా దమృతద్రవ సమ్మితమ్
పిబత, భాగవతం, రసమాలయం
ముహురహో రసికాః భువి భావుకాః (శ్రీమద్భాగవతమ్)

పుట 6 - గేయం 2

బాలకుని అవయువాలు పద్మాల వంటివి. తుమ్మెదలు భ్రాంతితో ఆ పద్మాలపై ప్రాలాలని చమకిస్తున్నాయి.

"కరారవిందేన పదారవిందం
ముఖారవిందే వినివేశ యంతమ్
వటస్య పత్రస్య పుటే శయానం
బాలం ముకుందం మనసా స్మరామి" (శ్రీకృష్ణకర్ణామృతం)

ఆ కరారవిందముచే పదారవింద
మందుకొని లీలగ ముఖారవిందమందు
ఉంచి వటపత్రమున శయనించు చిన్ని
బాలుని ముకుందు మనసార భక్తి గొల్తు"

పుట 6 - గేయం 4

"అవాద్యన్త విచిత్రాణి వాదిత్రాణి మహోత్సవే
కృష్ణే విశ్వేశ్వరానన్తే నన్దస్య వ్రజమాగతే (శ్రీ భాగ. X-V-13)

విశ్వేశ్వరుడు, అనంతుడు అయిన శ్రీకృష్ణుడు నందగృహానికి వచ్చిన మహోత్సవంలో విచిత్రంగా వాద్యాలు ప్రమోగాయి. ఈ వాద్యసమ్మేళనం చేత భవిష్యత్తులో శ్రీమద్భగవద్గీత ద్వారా జరిగే వివిధ యోగ సమన్వయం కూడా సూచితం.

పుట 6 - గేయం 5

"గోపాః పరస్పరం హృష్టా దధిక్షీర ఘృతామ్బుభిః
ఆసించన్తో విలిమ్పన్తో నవనీతైశ్చ చిక్షిపుః (భాగ. X-V-14)

ఆనందించిన గోపకులు పరస్పరం దధిక్షీర ఘృత జలాలతో తడుపుకొంటూ నవనీతం పూసుకొంటూ ఆ ద్రవ్యాలటునిటూ పడవేస్తున్నారు.

పుట 7 - గేయం 2

ఉజ్జ్వల నీలమణి : ప్రకాశించే సజీవ నీలమణి, శ్రీకృష్ణుడు. ఇది సామాన్యార్థం. విశేషార్థం - క్రీ.శ. 15 వ శతాబ్దికి చెందిన శ్రీరూప గోస్వామివారు రచించిన 'ఉజ్జ్వల నీలమణి' అనే అలంకార శాస్త్రం స్ఫురిస్తుంది. శ్రీకృష్ణ భక్తికి రసత్వం చేకూర్చే శాస్త్ర మిది. శ్రీకృష్ణ గోపికా విషయమైన శృంగారమే భక్తి. చిత్తద్రవము భక్తిరస స్థాయి భావమని రూపగోస్వామి మతం. చైతన్యమహాప్రభువుల ప్రత్యక్ష శిష్య డీతడు.

పుట 7 - గేయం 4

స్త్రీకి ప్రసవ వేదన లేకుండా చేయాలని ఆధునిక వైద్యులు ప్రయత్నిస్తే, స్త్రీల కది సమ్మతం కాలేదట. ఎంతో కొంత వేదన అనుభవిస్తేనే వారి కాత్మతృప్తి.

పుట 11 - గేయం 1

విద్యుచ్చైతన్యమూర్తిని దర్శించగానే గోపికలకు పూర్వజన్మ వాసన లుప్పొంగాయి. రమ్యదృశ్యాలు చూచినా, మధుర శబ్దాలు విన్నా ఇది సంభవమని కాళిదాసు తన అభిజ్ఞాన శాకుంతలంలో (V-2) ఇలా పేర్కొన్నాడు :

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి, జననాంతర సౌహృదాని"

"రమ్య దృశ్యముల్ గని, మధురమ్ములైన శబ్దముల్ విని, జీవి యుత్సాహ మందు, తిల్ స్మరణమాత్ర చేత మార్ద్రిమయి పొంగు జన్మ జన్మాంత రాబోధ సౌహృదములు" (రచయిత : సత్యం-శివం-సుందరమ్ - పుట 22)

పుట 11 - గేయం 2

పూర్వజన్మ వాసనలు పొంగటమే కాదు, అద్భుత బాలకుణ్ణి గాంచినప్పుడు, గోపికలకు ఆ బాలకుడు, భవిష్యత్తులో చేయగల ఘనకార్యాలు కూడా స్ఫురిస్తాయి. అనేక భవిష్యత్సూచనలు గోపికలు చేస్తారు. ఇవే ఈ రచనకు ప్రాణం.

పుట 11 - గేయం 4

"శ్రీకైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్, లోక ర
క్షైకారంభకు, భక్తపాలన కళాసంరంభకున్, దాన వో
ద్రేక స్తంభకు, కేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా
నాకంజాత భవాండ కుంభకు, మహానందాంగనాడింభకున్"

ఆంధ్ర మహాభాగవత ప్రారంభ పద్య మిది. భాగవత సారమంతా ఈ పద్యంలో స్ఫురిస్తుంది. 'మహానంద-అంగన' అంటే హ్లాదినీ రూపిణియైన శ్రీరాధాదేవి కూడా ధ్వనిస్తుంది. ఈ పద్యం పఠిస్తే భాగవతమంతా చదివిన ఫలం సంప్రాప్తం.

"అహో భాగ్య మహోభాగ్యం
నంద గోప వ్రజౌకసామ్
యన్మిత్రం పరమానందం
పూర్ణం బ్రహ్మ సనాతనమ్"

"ఆహా! గోకులవాసుల కేమి భాగ్యం! ఏమి భాగ్యం. పరిపూర్ణానందమయ సనాతన శ్రీకృష్ణ బ్రహ్మతత్త్వం మిత్రుడుగా సన్నిహితుడై వరసలు కలుపుకొనే బాంధవ్యంతో ఆవిర్భవించాడు". –శ్రీమద్భాగవతమ్

## పుట 12 - గేయం 2

భగవంతు డొక్కడే సార్థకనామధేయుడు. మానవుల పేళ్లు కేవల సంజ్ఞలు. సహస్ర నామాలకున్న వ్యుత్పత్త్యర్థాలు తెలుసుకొని పఠించటం సముచితం.

## పుట 12 - గేయం 4

"కృష్ణ కృష్ణ మహాయోగిన్, త్వ మాద్యః పురుషః పరః
వ్యక్తావ్యక్త మిదం విశ్వం, రూపంతే బ్రాహ్మణా విదుః
త్వమేక స్సర్వభూతానాం, దేహ స్వాత్మేంద్రియేశ్వరః
త్వమేవ కాలో భగవాన్, విష్ణు రవ్యయ ఈశ్వరః"

"ఈ సమస్తం ఆకర్షించే యోగేశ్వర కృష్ణా! నీవు ప్రకృతి కతీతుడవైన పురుషుడవు. వ్యక్తావ్యక్తమైన ఈ సమస్త జగత్తూ నీ స్వరూపమే. అఖిల భూతప్రాణి శరీరాంతఃకరణేంద్రియాల స్వామివి నీవే! సర్వశక్తిమంతమైన కాలం నీవే. సర్వవ్యాపివి. అనశ్వరుడవయిన ఈశ్వరుడవు".

"కర్షతి సర్వాపరాధాన్ - కృష్ణః
కృషిర్భూవాచ శబ్దః, ణశ్చ నిర్వృతి వాచకః
యయోరైక్యం పరం బ్రహ్మ
కృష్ణ ఇత్యభిధీయతే"

'కృషి' అంటే భూ-సత్. సత్ శబ్దం నిత్యతా బోధకం. 'ణ'కార మంటే నిర్వృతి, ఆనందం. రెండు కలిస్తే 'కృష్ణ' శబ్దం. అంటే నిత్యానందుడు. 'కృష్ణుడు' అంటే నిత్యానంద పరబ్రహ్మ.

## పుట 12 - గేయం 5

'అమ్మ' అనేది స్త్రీవాచకమే అయినా, ప్రేమగా పురుషవాచకాలకు కూడా చేరుస్తాం. 'వీడేనమ్మ! కృష్ణమ్మ!!' 'కృష్ణమ! గోపాలబాల కృష్ణమ!' అనే

జానపదగేయాలు ప్రసిద్ధం. ఆలోచిస్తే 'కృష్ణమాచార్యులు' అనే పేరులోను ఈ శబ్దముంది. కృష్ణ+అమ్మ+ఆచార్యులు > కృష్ణమ్మాచార్యులు > కృష్ణమాచార్యులు. ఇలా చెప్పటం శాస్త్రీయం కాదని వైష్ణవులు 'మా' అంటే లక్ష్మీదేవి అంటారు.

## పుట 14 - గేయం 3

నెమలిపింఛం కట్టటానికి కారణం గోపిక చెప్పింది. అది సామాన్యం. దీనికెంతో సంకేతార్థముంది. అంగాంగ సంయోగం లేని రతి, కేవలం చూపులతోనే వున్న ప్రాణి నెమలి. కృష్ణుని దృష్టి అటువంటి ఆనందానుభూతి కల్గిస్తుంది.

"చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ
బంగరు మొలతాడు పట్టుదట్టి;
సందియ తాయెతుల్ సరి మువ్వగజ్జెలు
చిన్నికృష్ణ! నిన్ను చేరి కొలుతు" అనే జానపదం ఈ సందర్భంలో స్మరించదగింది.

## పుట 15 - గేయం 1

కృష్ణ వియోగ సమయంలో శ్రీకృష్ణనామ సంస్మరణతో శ్రీకృష్ణనామ జపంతో కాలం గడపవలసి వస్తుందన్నది భవిష్యత్సూచన.

## పుట 15 - గేయం 3

శ్రీకృష్ణ తులాభార వృత్తాంత మీ గేయంలో సూచితం. తనకున్న ఆభరణ భారంతో నాథుణ్ణి తూచాలనుకున్న సత్యభామకు గర్వభంగమౌతుంది. రుక్మిణి భక్తితో సమర్పించిన తులసిదళానికే భగవంతుడు తక్కువ తూగుతాడు.

"పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత
మశ్నామి ప్రయతాత్మనః" (శ్రీమద్భగవద్గీతా ix-26) అన్న భగవద్వాక్యం విస్మరించరానిది.

## పుట 16 - గేయం 2

జానపద ప్రేమికుని ప్రార్థన మిది :

"జొన్న చేనికాడ సొగసుకత్తెను జూచి
నిన్నటాళ నుండి నిద్ర రాదు;
దాన్ని నన్నుగూర్చి దయసేయు మాధవా!
పొన్నపూలు దెచ్చి పూజసేతు"

### పుట 16 - గేయం 3

పారిజాతాపహరణ వృత్తాంత మిక్కడ సూచితం. 'ప్రబుద్ధుడు' అంటే పిల్లవాణ్ణి ఎగతాళిగా అన్నట్లుగానూ, నిజంగానే గొప్ప బుద్ధిమంతుడుగాను గ్రహించవచ్చు. కాసుల పురుషోత్తమకవి ఆంధ్రనాయకశతకంలోని ఇటువంటి ప్రయోగాలు ఆ శతకానికి గొప్పదనం చేకూర్చాయి.

### పుట 16 - గేయం 4

"Earth is the chosen place of mightiest souls,
Earth is the heroic spirits' battle field,
The forge where the Archmason shapes his works".

Sri Aurobindo's Savitri, p. 686.

"She made earth her home, for whom heaven was too small" (Ibid).

### పుట 17 - గేయం 1

"కస్తూరీ తిలకం లలాటఫలకే, వక్షఃస్థలే కౌస్తుభమ్
నాసాగ్రే నవమౌక్తికం, కరతలే వేణుం, కరే కంకణమ్
సర్వాంగే హరిచందనంచ కలయన్, కంఠేచ ముక్తామణిమ్
గోపస్త్రీ పరివేష్టితో విజయతే, గోపాల చూడామణిః"

శ్రీకృష్ణ కర్ణామృత పద్యం ఘంటసాల హృద్యగాత్రంలో విని పరవశిస్తాం.

### పుట 17 - గేయం 3

అన్ని వాద్యాల్లో గొప్పది మురళి. ఎందుకంటే అన్ని వాద్యాలు మానవ హస్తస్పర్శ నైపుణ్యం మీద ఆధారపడితే, మురళి వాయుపూరణం మీద ఆధార పడింది. ఆ నైపుణ్యం అతిమానుషుడైన కృష్ణున కెంతో ఊహించటం కష్టం.

కొండకోనల్లో ఉండి, మురళి వాయించి, గోపికల్ని ఎలా ఆకర్షించి, తన వద్దకు రావించుకొన్నాడో, శ్రీ విశ్వనాథవారి శృంగారవీధి కావ్యంలో 'బ్రహ్మ గీత'మనే శీర్షికలో గల పద్యసప్తకం ఆత్మీయతాముద్ర గలవి. అతిభాగవతం.

### పుట 19 - గేయం 1

'కరారవిందేన పదారవిందమ్
ముఖారవిందే వినివేశయంతం, తమ్" అనే శ్లోకం ప్రసిద్ధం.

పుట 19 - గేయం 3

'ఆరాధనీయః' అనటం వల్ల 'రాధాదేవి' స్ఫురిస్తుంది. గోపికలతోపాటు, రాధాదేవి కూడా బాలకృష్ణ సందర్శనానికి వచ్చి ఉండవచ్చు.

పుట 19 - గేయం 5

బాల్యంలో చూపుల్లో ప్రేమసముద్రాలు పొంగించాడు. పెద్దయిన తరువాత కూడా చూపుల్లోనే తత్త్వాబ్ధులూరించాడు. యుద్ధరంగంలో అంత సుదీర్ఘంగా గీతోపదేశం చేయుట ముచితమా? అని ఆధునికుల సందేహం. వ్యాసమహర్షి వైఖరీ వాక్కులో అంతగా విస్తృతమైంది - గీత. కృష్ణభగవానుని పశ్యంతీ వాక్కులో ఒక్క క్షణమే పట్టివుండవచ్చు. ఈ శ్లోకార్థం గ్రహించండి :

"చిత్రం వటతరోర్మూలం
వృద్ధాః శిష్యాః, గురుర్యువా
గురోస్తు మౌన వ్యాఖ్యానమ్
శిష్యాస్తు ఛిన్న సంశయాః"

రాసలీల చూపులతోనే జరిగింది.

పుట 20 - గేయం 2

త్రేతాయుగంలోని మునులే, భగవదాలింగన భాగ్యం కోసం ద్వాపరయుగంలో గోపికలుగా పుట్టారని "ఆలింగామో వయం రామ!" అన్న వాల్మీకి వాక్యం స్మరణీయం.

పుట 20 - గేయం 3

మన్మథుణ్ణి దహించాడు - శివుడు. ఇది కామదహనం. మళ్లీ అవసరానికి బ్రతికించుకొన్నాడు. కాని శ్రీకృష్ణుడు మన్మథుణ్ణి మథించాడు. రాసలీల కామవిజయంగా శ్రీధరుడు వ్యాఖ్యానించాడు. "భగవతః కామవిజయరూప రాసక్రీడా శ్రవణాదేః కామవిజయమేవ ఫలమాహ".

పుట 20 - గేయం 4

కాత్యాయనీ వ్రతాచరణం సూచితం. ఆంధ్రభాగవతం దశమస్కంధం పూర్వభాగంలో 807-810 పద్యాల్లో ఈ విషయం ప్రస్తావింపబడింది.

పుట 21 - గేయం 1-5 ; పుట 22 - గేయం 1-4

శ్రీ విష్ణు సహస్ర నామాల్లో కొన్ని యిందులో పొందుపరచబడ్డాయి.

పుట 22 - గేయం 5 ; పుట 23 - గేయం 1

శ్రీ లలితా సహస్ర నామాల్లో కొన్ని పేర్కొనబడ్డాయి. పురుష వాచకాలుగా, అభేదం సూచించటానికి.

పుట 24 - గేయం 1

కొమ్మలంటే స్త్రీలనీ అర్థం. నవచైతన్య ఫలం = నవద్వీపంలో జన్మించిన చైతన్యమహాప్రభువనీ స్ఫురిస్తుంది.

పుట 25 - గేయం 1

"ప్రేమైవ గోప రామాణాం, కామ ఇత్యగమత్ ప్రథామ్" (భక్తిరసామృత సింధువు) అని భక్తిరసామృత సింధువు. (చూ. ప్రేమభక్తి, శ్రీ కుందుర్తి నరసదాసు, పుట 58) "గోపస్త్రీల యొక్క ప్రేమ 'కామ'మను పేర బరగినది. ఇది లౌకిక కామమని చెప్పఁదగదు. వ్రజసుందరుల కామము యొక్క ఆశ్రయ స్వరూపము శ్రీకృష్ణభగవానుడగుటచే ఆ కామమును జడ విషయ మనరాదు" ప్రేమభక్తి. "కామోత్కంఠత గోపికల్" (vii-18) అన్న పోతన్నగారి ప్రయోగ సారస్యం పై రీతిగా గ్రహించాలి.

పుట 25 - గేయం 2

శ్రీరాముడు, సుగ్రీవునితోను, విభీషణునితోను స్వకార్యసిద్ధికై మైత్రి గావించాడు. కాని వల్లవ కుమారులతో గాని, కుచేలునితో గాని, శ్రీకృష్ణుని మైత్రి నిర్వ్యాజమైంది. ఆదర్శమైంది.

"మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః
మనః షష్ఠాని ఇంద్రియాణి, ప్రకృతిస్థాని కర్షతి" (గీత xv-7)

అనే గీతాశ్లోక మిక్కడ స్మరణీయం. భగవంతుడెంత సనాతనుడో, జీవుడూ అంతే సనాతనుడు. పరమాత్మ తన అంశతోనే తానాడుకొంటాడు. ఇదే కథారూపంలోని రాసక్రీడ.

పుట 25 - గేయాలు 3, 4

"మమతన్ మోములు మీది కెత్తుకొని
దోమంథంబు సారించి, హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్పి
మురళీగానామృత శ్రేణి, క

ర్ణములం గ్రోలుచు, మేత మాని
గళితానందాశ్రులై, వ్రీతి తో
సములై గోవులు సూచుచున్న
నదిగో! పద్మాక్షి!! వీక్షించితే" (x-790)

"జగతీజంబుల శాఖలెక్కి
మురళీ శబ్దామృత స్యందమున్
మిగులన్ వీనులఁ ద్రావి, వ్రేగువడి
నెమ్మిం గృష్ణ రూపమ్ము వి
త్తగమై యుండగ నడ్డుపెట్టు క్రియ
నేత్రంబుల్ లగన్ మూసి యీ
ఖగముల్ సొక్కెడిఁ జూచితే
ముని జనాకారంబులన్ గామినీ" (x-791)

ఇటువంటి పద్యాలీ సందర్భంలో మదిలో మెదలుతాయి.

## పుట 25 - గేయం 5

శివుడు చేసేది - తాండవం, ఇది ఉద్భటం, రౌద్రరస ప్రధానం. భూదేవి భయంలో కంపిస్తుంది కాని అమ్మ చేసేది లాస్యం. ఇది మృదులం. దీనితో అమ్మ, భూమాతను లాలిస్తుంది.

రాసలీల శృంగారరస ప్రధానం. భూదేవి ఈ నర్తనానికి పులకితగాత్ర అవుతుంది. రాసలీల గోలోకంలో ఎల్లప్పుడూ జరుగుతుంది. ఇప్పుడు భూమిమీద జరుగనున్నట్లని గోపికా హృదయస్ఫూర్తి.

ఈ ఆనందఖేల దర్శించి, దేవతలు కూడా పరవశించినట్లు భాగవతం సుదీర్ఘ వచనంలో అభివర్ణించింది. (x-1082)

కం. హరిణీ నయనల తోడను
హరి రాసక్రీడ సేయ నంబర వీధిన్
సురనాథులు భార్యలతో
సొరిది విమానంబు లెక్కి చూచి రిలేశా!

ఇది శిష్టచరితం లాగా ధరణి, గగనమండల సుందరమని పోతనార్యుని అభివర్ణన. ఇది గర్హింపదగిన కామక్రీడ అని భావించటం దౌర్భాగ్యం.

పుట 27 - గేయం 1

బోధలంటే భగవద్గీత వేసే బోధయి. బ్రతకట మంటే గానుగెద్దులాగా గతానుగతికంగా ధనార్జన యంత్రంగా జీవించటం కాదు. మహత్తరాకాంక్షతో భగవంతుడు తనకు నిర్దేశించిన కార్యమేమిటో తెలుసుకోని, తత్కార్యసిద్ధికై ఉపకరణంలాగా నవనవోన్మేష చైతన్యంతో మనుగడ సాగించటం - 'బ్రతుకు కళ కీలకం' తెలిసికోట మంటె అది. అంటె నరులందరూ నరునిలాగా విజయశ్రీలుగా జీవించాలి.

పుట 27 - గేయం 4

ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, భగవదారాధకుడిలో పరస్పర దోహదకారులై పెంపొందాలి. ఈ త్రివిధ శక్తుల సంపుటియే శ్రీలలితాదేవి (658). ఆ దేవి పుంరూపమే శ్రీకృష్ణుడు.

"ఇచ్ఛా శిరః ప్రదేశశ్చ, జ్ఞానంచ తదధోగతా
క్రియా పద గతా హ్యస్యాః, ఏవం శక్తి త్రయం వపుః" ఈ శరీరమే శ్రీచక్రం.

పుట 27 - గేయం 5

కాళిదాస మహాకవి, నాటకం చాక్షుష క్రతువుగా అభివర్ణించాడు. బాలపరమేశ్వర సందర్శనం అటువంటి క్రతువే.

పుట 28 - గేయం 4

గోపికా విభూతి యొక్క మొక్కవోని ఆకాంక్ష లేక తపస్సు పండించటానికే దేవకీదేవి ఆనంద వర్ధనుడు, యశోదానంద వర్ధనుడైనాడు.

పుట 29 - గేయం 1

"అచతుర్వదనో బ్రహ్మా
ద్విబాహు రపరో హరిః
అఫాలలోచన శ్శంభుః
భగవాన్ బాదరాయణః" అన్న కృష్ణద్వైపాయన స్తుతి యీ రీతిగా కృష్ణపరం కావించబడింది.

పుట 29 - గేయం 2

ధర్మార్థకామమోక్షాలు - చతుర్విధ పురుషార్థాలు. ఇవి అందరు ఆశించేవి. నిత్యం సకల్పించేవి. కృష్ణావతారం వీటి సాధన కోసమే పరిమితమైంది కాదు. ఇంతకన్న మిన్న అయిన ప్రేమభక్తిని పంచటానికి ఏర్పడ్డది. ఇదే రాగభక్తి.

సంగీతంతో తానార్ద్రహృదయుడై గోపికల్ని ఆర్ద్రహృదయుల్ని గావించి, తరింపజేసే భక్తి. ఇదే రాసలీల. ఇదే జీవుల పరమార్థం. దీన్ని ఆశించేవారు సామాన్య సంసార వ్యామోహాన్ని అతిక్రమించాలి.

ధూర్జటి తన శ్రీకాళహస్తీశ్వర శతకంలో అంటాడు :

"అంతా మిథ్య తలంచి చూచిన
　　నరుండట్లౌ టెఱింగిన్ సదా
కాంతల్, పుత్త్రులు, నర్థముల్
　　తనువు నిక్కంబంచు మోహార్ణవ
భ్రాంతింజెంది, చరింపుగాని
　　పరమార్థంబైన నీయందు దా
చింతాకంతయు జింత
　　నిల్పడు గదా! శ్రీకాళహస్తీశ్వరా!!"

పుట 29 - గేయం 4

"వేణుగానలోలుని గన వేయి కనులు చాలవుగే" అన్న త్యాగబ్రహ్మ కృతి నాలకించండి. ఒళ్లంతా కళ్లున్నా ఆ సౌందర్యదాహం తీరదు. ప్రతి ఇంద్రియం భగవదనుభూతికై తపించాలి.

పుట 30 - గేయం 5

చతుర్భుజుడై, శంఖ చక్ర శార్ఙ్గ గదాదులతో అద్భుతంగా కారాగారంలో కన్పించినా, అవన్నీ ఉపసంహరించుకొని మామూలు బాలకుడుగా యశోద ప్రక్కన చేరాడు. కాని ఆ చిహ్నాలు పాదాలలో గోచరించాయి గోపికలకు. "ఏకచక్రే మహాభోగీ, ద్విచక్రే రాజపూజితా" అని సాముద్రికులు సామాన్యంగా అంటూ వుంటారు. అసామాన్య బాలకుని కిటువంటి వుండడంలో ఆశ్చర్యమేముంది?

పుట 31 - గేయం 1

గోలోక సందర్శన భాగ్యం అక్బర్ చక్రవర్తికి హరిదాసనే కృష్ణభక్తుని కృప వల్ల కల్గిందని కీ.శే. శ్రీ కుందుర్తి వేంకటనరసయ్య పాకయాజిగారు తమ 'ప్రేమభక్తి' అనే పుస్తకంలో (పుటలు 70-80) వివరించారు.

ఇప్పటికీ బృందావనంలో నిత్య రాసలీల జరుగుతుందని నమ్మకం. గోలోకంలోని నిత్యకృష్ణుడే ద్వాపరయుగంలోని లీలాకృష్ణుడు. గోపికలతో రాసలీల లీతనివే.

పుట 31 - గేయం 2

"నమో బ్రహ్మణ్య దేవాయ
గో బ్రాహ్మణ హితాయ చ
జగద్ధితాయ కృష్ణాయ
గోవిందాయ నమోనమః" భీష్మస్తుతి - మహాభారతం

ఈ శ్లోకం పితృకార్యాల్లో కూడా చదవటం గమనార్హం.

పుట 32 - గేయం 4

గోలోకంలోని నిత్యకృష్ణుడు, "ఏకాకినీ నరమతే సద్వితీయమైచ్ఛత్" అన్న శ్రుతివాక్యం ప్రకారం తన ఆనందానుభూతికై రాధాదేవిని సృష్టించుకొన్నాడు. ఆ ఆహ్లాదినీశక్తి ముందుగా భూలోకంలో పుట్టిన తరువాత నిత్యకృష్ణుడు కూడా లీలాకృష్ణుడుగా అవతరిస్తాడు. బ్రహ్మవైవర్తపురాణంలో ఈ విషయం విదితం. చూ. ప్రేమభక్తి, పుట 75

పుట 32 - గేయం 5

'రాధ' అని పూర్తిగాకుండా 'రా' అని వింటే చాలు :

"రా" శబ్దం కుర్వతస్త్రస్తో దదామిభక్తి ముత్తమామ్
"ధా" శబ్దం కుర్వతః పశ్చాద్యామి శ్రవణ లోభతః. —బ్రహ్మవైవర్తపురాణం

"నోట 'రా' అనే శబ్దం వినగానే నే నానందత్రస్తుడనై మిక్కిలి ఉత్తమమైన నా భక్తి ప్రసాదిస్తాను. 'ధా' అనే శబ్దం వినగానే నా ప్రియురాలి నామం పలుకుతున్నాడని వినాలని పరువులు తీస్తాను".

పుట 32 - గేయం 2

"రాధా రాసేశ్వరీ రమ్యా
కృష్ణమంత్రాధి దేవతా
సర్వాద్యా సర్వ వంద్యాచ
బృందావన విహారిణీ"

రాధ రాస కధీశ్వరి, అందమైంది. కృష్ణమంత్రాని కధిదేవత. సర్వానికి ఆదిస్వరూపిణి. అందరిచే వంద్య. బృందావన విహారిణి. (ప్రేమభక్తి పుట 74)

పుట 32 - గేయాలు 3, 4

షట్ చక్రాలతో కూడిం దీ శరీరం. ఈ చక్రాల కాద్యంతాల్లో రెండేసి గ్రంథులుంటాయి. స్వాధిష్ఠాన చక్రంలోవి - బ్రహ్మగ్రంథులు. మణిపూర

చక్రంలోవి - విష్ణుగ్రంథులు. హృదయస్థానంలోవి. అనాహతచక్రానికి చెందినవి రుద్రగ్రంథులు.

శ్రీకృష్ణ దేహ సంస్పర్శచేత గోపికలకు ఈ గ్రంథులు విడివడగా వారి శరీరాలు మహాభావశరీరాలైనా యంటారు.

"శరీరేవ యథాస్థూలం, సూక్ష్మంచ కారణమ్
తథై వాన్యద్దేహం, జ్ఞేయం భావదేహం ప్రకీర్తితమ్.

కృపాలబ్ధ మిదం దేహం, సహజం జన్మ జన్మని
అథవా సాధనాల్లబ్ధం, వా మహేశ్వరీ.

న సగుణం, నిర్గుణం వా దేహమిదం పరాత్మకమ్
క్వచాపి నహి ద్రష్టవ్యం లోకే బృందావనం వినా.

సంగతం సహ కృష్ణేన గోపీనాం చరితంచ యత్
తన్న కామాథ కామాద్వా భావదేహేన తత్కృతమ్.

స్థూల సూక్ష్మ కారణ దేహం లాగానే భావదేహ మొకటి వుంది. ఇది భగవత్కృపా లబ్ధం. ఆయన కృపచేత జన్మజన్మల్లో లభిస్తుంది. ఓ పార్వతీ! ఇది ఒక్కొక్కప్పుడు సాధన వల్ల కూడా లభిస్తుంది. ఇది కర్మ జన్యమైన సగుణం కాదు. నిర్గుణం కాదు. ఈ పరాత్మక దేహం బృందావనంలో దప్ప ఇంకెక్కడా గోచరించదు. శ్రీకృష్ణునితోఁ గలిసి రమించే ఈ దేహం, ప్రాకృతశరీరానికి వలే కామజన్యం కాదు. అకామమూ గాదు. ఇది భావదేహ కృతం. (ప్రేమభక్తి - 83, 84 పుటలు).

రాసలీలా ఘట్టం నిరంతరం పఠించి తన్మయులం కాగల్గితే భావదేహం లభించవచ్చు. చైతన్యమహాప్రభువీ భావదేహం పొందారు.

## పుట 33 - గేయం 2

"శరద్రాత్రిం గానమొనర్చు కృష్ణు సన్నిధికి గోపికలు వచ్చుట" అనే శీర్షిక క్రింద (x-967) ముక్తపదగ్రస్త శబ్దాలంకారయుతంగా పోతనగారి వచన రచన అలిరుచిరంగా సాగింది.

"ఘన మధుర గీత నినదము
విని వచ్చిన గోపికలను వీక్షించి, నయం
బున మేటి సుగుణి నేర్పరి,
తన వాగ్వైభవము మెఱయఁదగ నిట్లనియెన్ (x-975)

శా. "మేలా మీకు? భయంబు పుట్టదు గదా
మీ మందుకున్? సింహ శా
ర్దూలానేకపముఖ్యముల్ తిరిగెడున్
దూరంబు లేలెంతురే?
యేలా వచ్చితి రీ నిశాసమయం
దిచ్చోట వర్తింతురే?
చాలుం జాలు లతాంగులార!
చనుడీ సంప్రీతితో మందుకున్ (x-976)

శా. ... తగువులే యీ సాహసోద్యోగముల్? (x-977)

చ. ఇలువడి సున్నసేసి, హృద
యేశుల సిగ్గులు పుచ్చి, యత్త మా
మల నెరియించి, సోదరుల
మానము సూఱలు పుచ్చి, తల్లి దం
డ్రుల రుచి మాన్చి, బంధులకు
రోత యొనర్చుచు జారవాంఛలన్
వలనటే సత్కులాంగనలు
వత్తురె? లోకులు సూచి మెత్తురే? (977)

చ. .... సనాతన ధర్మము లాదువారికిన్
బెనిమిటులన్ భజించుటలు
పెద్దలు సెప్పుచునుందు రెల్లడన్ (981)

క. ధ్యానా కర్ణన దర్శన
గానంబుల నా తలంపు గలిగినఁ జాలుం
బూనెదరు కృతార్థత్వము
మానవతుల్ చనుడు మరలి మందిరములకున్ (-982)

ఇలా శ్రీకృష్ణుడు సామాన్యనీతులు వల్లించి, గోపికలను నిరాకరించటం, వారి ఆత్మ సమర్పణ సమగ్రతను పరీక్షించటానికే అయినా, గోపికలకెంతో బాధ కల్గించి ఉంటుంది.

పుట 33 - గేయం 3

శ్రీకృష్ణుని జేరిన గోపికలు అర్థించా రీరీతిగా
"ఏ పొత్తుల నొల్లమో పురుష భూషణ
దాస్యము లిచ్చి కావవే!" (x-992)

ఇదే దాస్యభక్తి. తక్కిన భక్తుల కిదే పునాది. తక్కిన వాత్సల్య సఖ్య మధుర భక్తుల్లో కూడా దాస్యభక్తి ఉంటుంది.

పుట 34 - గేయాలు 1-5

ఈ సందర్భంలో మన ఆంధ్రుడే అయిన శ్రీమద్వల్లభాచార్య విరచిత "మధురాష్టకం" మనసులో మసలుతుంది. అది చదివేకొద్ది మధుర భావన, మధుర జీవితం అలవడుతుంది. అందుకే యిక్కడందిస్తున్నా.

"అధరం మధురం, వదనం మధురం
నయనం మధురం, హసితం మధురం
హృదయం మధురం, గమనం మధురం
మధురాధిపతే రఖిలం మధురం.

వచనం మధురం, చరితం మధురం
వసనం మధురం, వలితం మధురం
చలితం మధురం, భ్రమితం మధురం
మధురాధిపతే రఖిలం మధురం.

వేణుర్మధురో రేణుర్మధురో
పాణీ మధురౌ, పాదౌ మధురౌ
నృత్యం మధురం, సఖ్యం మధురం
మధురాధిపతే రఖిలం మధురం.

గీతం మధురం, పీతం మధురం
భుక్తం మధురం, సుప్తం మధురం
రూపం మధురం, తిలకం మధురం
మధురాధిపతే రఖిలం మధురం.

కరణం మధురం, తరణం మధురం
హరణం మధురం, స్మరణం మధురం
వమితం మధురం, శమితం మధురం
మధురాధిపతే రఖిలం మధురం.

గుంజా మధురా, మాలా మధురా
యమునా మధురా, వీచీ మధురా
సలిలం మధురం, కమలం మధురం
మధురాధిపతే రఖిలం మధురం.

గోపీ మధురా, లీలా మధురా
యుక్తం మధురం, ముక్తం మధురం
భుక్తం మధురం, దృష్టం మధురం
మధురాధిపతే రఖిలం మధురం.

గోపా మధురా, గావో మధురా
యష్టి ర్మధురా, సృష్టి ర్మధురా
దళితం మధురం, ఫలితం మధురం
మధురాధిపతే రఖిలం మధురం."

పుట 36 - గేయం 4

తజ్జనని లోఁగిటంగల
రజ్జు పరంపరల గ్రమ్మఱన్ సుతుఁగట్టన్
బొజ్జ దిరిగి రాదయ్యె, జ
గజ్జాలము లున్నబొజ్జ గట్టన్ వశమే! (x-385)

పుట 37 - గేయం 3

"వజ్రాదపి కఠోరాని, మృదూని కుసుమా దపి
లోకోత్తరాణాం చేతాంసి, కోను విజ్ఞాతు మర్హతి?
(ఉత్తర రామచరిత - ii ఎ. 7)

వేణునాదా యిప్పుతిల్లజేసే మృదువైన వ్రేళ్లే గోవర్ధనగిరి నెత్తటం మహాశ్చర్యం. ఊరకే ఎత్తటం కాదు, వారేపు. వ్రజవాసుల్ని, వారి గోగణంతోపాటు దాని క్రిందకి చేర్చి నిర్భయంగా ఉండమని అభయమివ్వటం ఆ బాలపరమేశ్వరుడికే చెల్లింది :

"బాలుం డీతడు, కొండ దొడ్డది
మహాభారంబు సైరింపగా
జాలండోయని దీని క్రింద నిలువన్
శంకింపగా బోల దీ
శైలాంభోనిధి జంతు సంయుత
ధరాచక్రంబు పైఁబడ్డ నా
కే లల్లాడదు, బంధులార!
నిలు డీ క్రిందం బ్రమోదంబునన్" (x-920)

ఆర్తులైన భక్తకోటి కంతకూ పరమేశ్వరుని అభయముద్ర యిది.

పుట 37 - గేయం 4

చాణూర ముష్టికులనే మల్లవీరుల్ని మడియించిన ఘట్టం స్మరింపజేస్తుంది గేయం.

ఆ సమయంలో పౌరకాంతల విస్మయం సదా సంస్మరణీయం :

"మంచి కుమారులన్ గుసుమ
మంజు శరీరుల దెచ్చి, వెల్లరే!
యుంచిత వృషపాదులు
మహాద్రి కఠోరులునైన మల్లురం
గ్రింమఁబెట్టి రాజు
పెనగింపుము జూముము మన్నవాడు, మే
లింపక లేదు, మానుమన
డిట్టి దురాత్ముని మున్ను వింటిమే? (x-1350)

## పుట 38 - గేయాలు 3, 4

పూతన వృత్తాంతం ఇందులో స్ఫురిస్తుంది : మాయ రాక్షసి కృత్రిమ సౌందర్యం, పోతనార్యుడు, మత్తకోకిం మానినీ వృత్తాల్లో అభివర్ణించటం గమనార్హం.

"క్రాలు కన్నులు, గుబ్బ చన్నులు,
గందువొందని చందురుం
బోలు మోమును, గబ్బు లేదను
బుద్ధి దూఱని కౌను, నే
రాలమైన పిరుందుఁ బల్లవ
రాగ పాద కరంబులుం
జాల దొడ్డగు కొప్పుఁ,
నొప్పుగు సర్వమోహనమూర్తితోన్" (x-213)

"కాంచన కుండల కాంతులు గండ యుగంబునఁ
గ్రేళ్లురుకన్ జడపై
మించిన మల్లెల మేలిమి తావులు మెచ్చి
మదాళులు మింటను రా
నంచిత కంకణ హార రుమల్
సెలువారగ బైవలు పంచల నిం
పించుక జారగ నిందు నిభానన యేఁగె
గుమారుని యింటికినై" (x-214)

## పుట 38 - గేయం 4

కం. విషధర రిపు గమనునికిని
విషగళ సఖునికి విమల విషశయునునికిన్
విషభవభవ జనకునికిని
విషకుచ చను విషము గొనుట విషమే తలపన్? (x-233)

"కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిము వా యశోదాస్తన్యమ్
తవస్వాదు వద్రప్రభోమే" (తిక్కన - విరాటపర్వావతారిక)

పుట 38 - గేయం 5

అ. నలకూబర మణిగ్రీవులకు నారదు డిచ్చిన శాపవృత్తాంతం స్మరింపవచ్చు:

కం. "కలవాని సుతుల మనుమను
గలకంఠుల తోడఁగూడి కానరు పదులం
గలలోనైనను వీరికి
కల్లకొప్పడగింపి బుధులఁగలుపుట యొప్పున్" (x-396)

వ. అని చింతించి విజ్ఞాన విశారదుండగు నారదుండు నలకూబర మణిగ్రీవులం జూచి మీరలు స్త్రీమదాంధులరు గావున భూలోకంబున నర్జున తరువులై నూఱు దివ్యవర్షంబు లుండుం డటమీద గోవింద చరణారవింద పరిస్పందంబున (397)

క. ముక్తులరై నారాయణ భక్తులరై పరమ సాధుభావ శ్రీ సం
సక్తులరై సురలోక వ్యక్తుల రయ్యెదరు నాదు వాక్యము కతనన్ (398)

ఆ. తనచే సంహరింపబడ్డ రాక్షసుల తేజస్సును తనలోనికి స్వీకరించిన దాని కుదాహృతులు :

(i) కం. రోషప్రమోద నిద్రా
భాషాశన పానగతులఁ బాయక చక్రిన్
దోషరతిఁ జూచియైన వి
శేషరుచిం గంసుడతనిఁ జెందె నరేంద్రా! (x-1376)

(ii) ఉ. ప్రల్లదమేది యిట్లు శిశుపాలుడు
వజ్రహతాద్రితుల్యుడై
త్రెళ్ళుదు వానిదైన పృథుదేహము
వెల్వడి తేజ మంబరం
బెల్ల వెలుంగ వచ్చి పరమేశ్వరు దేహము
సొచ్చె విస్మయో
ల్లుల్ల విశాలనేత్రులయి భూపతులెల్లరు
జూచుచుండఁగాన్. (భార. సభా. ii-69)

ఈ విషయంలో ధర్మరాజుకు రాజసూయయాగ సందర్భంలో కల్గిన సందేహం, నారదుడు తీర్చిన వైనం, భాగవతం, సప్తమ స్కంధాదిలో కనిపిస్తుంది :

వ. మున్ను ధర్మరాజు సేయు రాజసూయ యాగంబున బాలుండైన శిశుపాలుండు హరిని నిందించి, నిశిత నిర్వక్ర చక్రధారా దళిత మస్తకుండయి, తేజోరూపంబున వచ్చి, హరిదేహంబు సొచ్చినం జూచి, వెఱగుపడి, ధర్మజుండు సభలోనున్న నారదునిం జూచి యిట్లనియె : (9)

ఆ. "ఎట్టివారికైన, నేకాంతులకునైన
వచ్చి చొరగరాని వాసుదేవు
తత్త్వమందుఁజేది ధరణీశు డహితుడై
యెట్లు సొచ్చె మునివరేణ్యా! నేడు? (10)

ఉ. వేనుడు మాధవుందెగడి, విప్రులు దిట్టిన భగ్నుడై తమో
లీనుడు గాడె? తొల్లి మదలిప్తుడు చైద్యుడు పిన్ననాట నుం
డేనియు మాధవున్ విన సహింపడు; భక్తివహింప, దట్టి వాఁ
డేనిబిడ ప్రభావమున నీ పరమేశ్వరునందు జొచ్చెనో? (11)

వీరు వైరభక్తులు. "వైరానుబంధనంబునఁ జేరిన చందమున విష్ణుం జిరతర భక్తిం జేరగ రాదని తోఁచు" (15) నంటాడు నారదుడు.

పుట 39 - గేయం 1

వ. .....మింట నుండి కంటఁబడి కంటువడఁ గంసున కిట్లనియె : (153)

ఉ. చెంపరివై పొరిం బొరిని
దేవకి బిడ్డలఁ జిన్నికుఱ్ఱలం
జంపితి వంతనైన నుపశాంతి
వహింపక బాలమీద నొ
ప్పింపగ విస్సిరో! యిదియు
వీరమె? నా సరసన్ జనించి నిన్
జంపెడు వీరు డొక్కచెడ
సత్కృతి నొందెడివాడు దుర్మతీ! (154)

క. ఇట్టయిన వెరవనేటికి?
బట్టణముల మందలందుఁ బల్లెల నెల్లం
బుట్టెడి పెరిగెడి శిశువుల
బట్టి వధింపెదము మమ్ముఁబంపు మధీశా! (164)

పుట 39 - గేయం 3

శ్రీ విశ్వనాథవారి అద్భుత భావచిత్రం తిలకించండి :

"చిమ్ముల దూడ వంక నెగజిమ్మెడి
కోరల కన్నుదోయితో
గుమ్మము వద్ద నున్న దదిగో! కను
నీకయి గుమ్మపాల గో
వమ్మ, మ జీవు త్రాగకయ
యా తన దూడనుగూడ ద్రావనీ
దమ్మ! మఱింకలే, నురుసు
లారక మున్నుగఁ ద్రావఁగావలెన్"

(శృంగారవీధి, ప్రాతస్స్తవము, పుట ౫౯)

పుట 40 - గేయాలు 1, 2

"షోడశ సహస్ర స్త్రీ సంగతుండైన శ్రీకృష్ణుని మహిమను నారదుం డరయుట" అనే ఘట్టం (x-598-635). ఈ ఘట్టం చదివితే కలిగే ప్రయోజన మిది :

"అని హరి యిట్లు షోడశ
సహస్ర వధూమణులం బ్రియంబునన్
మనసిజకేళిఁదేల్చిన
యమానుషలీల సమగ్రభక్తితో
వినినఁ బఠించినం గలుగు
విష్ణు పదాంబుజ భక్తియున్, మహో
ధన పశు పుత్త్ర మిత్ర
వనితాముఖ సౌఖ్యములున్ నరేశ్వరా! (635)

కారణం - పరమేశ్వర మహిమ కిది పరాకాష్ఠ.

"ఒక యింటం గజవాజి రోహకుడునై
యొక్కింట భుంజానుడై
సకలాత్ముండు, పరుండు,
షోడశ సహస్ర స్త్రీ నివాసంబులం
దొక బోటింటను దప్పకుండ
నిజమాయోత్సాహుడై యుండ న
య్యకలంకున్ వరదున్
మహాపురుషు, బ్రహ్మణ్యున్, నతాబ్జాసనున్" (627)

పుట 40 - గేయం 3

మ. "పతులం బిడ్డల బంధులన్
సతులరున్ బాటించు టే ధర్మ ప
ద్ధతి యౌనంటివి, దేహధారిణులకున్
ధర్మజ్ఞ! చింతింపుమా!
పతి పుత్త్రాదిక నామమూర్తి
వగుచున్ భాసిల్లు నీయందుఁ ద
త్పతి పుత్త్రాదిక వాంఛలన్ సలిపి
సంభావించు టన్యాయమే? (x-986)

పుట 40 - గేయం 4

నరకాసురుడు చెఱబట్టిన పదాఱువేల రాజకన్యల్ని చెఱవిడిపించి, శ్రీకృష్ణుడు సగౌరవంగా ద్వారకానగరానికి జేర్చిన వృత్తాంత మిక్కడ సూచితం. శ్రీకృష్ణ ప్రేమామృత మాస్వాదించిన ఆ రాజకన్యలు తమ అదృష్టాని కబ్బురపడి, నరకాసురుడు తమకు మహోపకారం కావించినందుకు సంతోషించారు. అతడు చెఱబట్టకపోతే వారు సాదాసీదా రాజకుమారుల్ని పెండ్లియాడేవారేగా!

"పాపపు రక్కసుండు సెఱ
పట్టె నటంచుఁ దలంతు మెప్పుడున్
బాపురె! వాని ధర్మమున
బద్మదళాక్షునిఁ గంటి మమ్మ! ము
న్నీ పురుషోత్తముం గదియ
నేమి వ్రతంబులు సేసినారమో?
యా పరమేష్ఠి పుణ్యుడు గదమ్మ!
హరిన్ మము గూర్చె నివ్వటన్" (x-209)

పుట 40 - గేయం 5

రుక్మిణీ కళ్యాణ వృత్తాంత మిందులో సూచితం. సజీవ ప్రేమరేఖ అయిన విప్రోత్తముణ్ని రాయబారిగా పంపింది - రుక్మిణి. ఆమె ప్రేమావేదన అగ్నిద్యోతనుడు శ్రీకృష్ణునికి వినిపిస్తుంటే, ప్రేమరేఖ చదువుతున్నట్లే అనిపిస్తుంది. చూ. x - 1702-1709.

పుట 41 - గేయం 2

ఆర్తభక్తి భాగవతంలో గజేంద్రమోక్షణ ఘట్టంలో సమగ్రంగా పరిపోషితం. ఇది శ్రీకృష్ణునికి ప్రత్యక్షంగా సంబంధించింది గాదు.

గోగోపికా సంఘాన్ని కార్చిచ్చు చుట్టుముట్టినప్పుడు ఆర్తితో వారు శ్రీకృష్ణుణ్ణి శరణన్నారు :

మ. "అదె వచ్చెన్ దవవహ్ని
 ధూమకణ కీలాభీల దుర్వారమై
యిదె కప్పెన్ మము నెల్లవారి నిట
 మీదేలాగు రక్షింపు నీ
పద పద్మంబులు కాని యొండెఱుగ
 మో పద్మాక్ష! యో కృష్ణ!! క్రొ
వ్వొద మో రామ! మహాపరాక్రమ!
 దవాగ్నిన్ వేగ వారింపవే. (713)

క. నీ పాదంబులు నమ్మిన
నాపద లెక్కడివి? జనుల కత్యుగ్ర మహో
దీపిత దావ జ్వాలనము
పైపడ కుండెడి విధంబు భావింపగదే! (714)

వ. అని ఘోషించు ఘోషజనులం గరుణించి జగదీశ్వరుండగు ననంతుం డనంత శక్తియుతుండై గహనంబు నిండిన దావదహనంబు పానంబు సేసిన విజయగానంబు దశదిశల నిగిడె.

ఇలాంటి ఘట్టాలు దశమ స్కంధ మంతా కనిపిస్తాయి. ప్రత్యేకించి ద్రౌపదీ వస్త్రాపహరణ ఘట్టం నిరూపితం గాదు.

భారతంలో ద్రౌపది ఆర్తిని నన్నయ చిన్న వచనంలో పేర్కొన్నాడు : (సభా - 230).

"ఇట్లు జగత్త్రియ విజయ భుజ వీర్య సనాథులైన నాథులు గల్గియు, ననాథయుం బోలె పాంచాలరాజపుత్త్రి భయార్తయై యార్తజన శరణ్యుండైన జగన్నాథు, జనార్దనుం దలంచుచు..."

ద్రౌపది పైకి శ్రీకృష్ణస్తుతి చేసినట్లు (ఏడు శ్లోకాల్లో) వ్యాసభారతంలో ఉన్నా, నన్నయగారెందుకో పరిహరించారు. బహుశః కౌరవుల సభలో అట్టి ఆర్తి ప్రకటన మంతగా ఉచితం గాదనుకున్నాడేమో!

ఇక భాగవతంలో కుంతి కావించిన కృష్ణస్తుతిలో 'దేవతానీక బ్రాహ్మణ గోగణార్తి హరణా!' (1-167) అన్న సంబోధనలోను; 'ధార్తరాష్ట్రుఁడు సము ద్ధతిఁ జీర లొలువంగ ద్రౌపది మానంబు తలకుండ' (1-155) అని అనేక

ఘట్టాలు స్మరిస్తూ పేర్కొంటుంది.

ఈ క్రింది పద్యంలో కౌరవు లెన్ని అకృత్యాలు చేసినా అందులో పరాకాష్ఠ ద్రౌపది పరాభవంగా భాగవతోద్ఘాటన (1-148)

శా. పాంచాలీ కబరీ వికర్షణ
మహాపాప క్షతాయుష్కులం
జంచద్గర్వుల, ధార్తరాష్ట్రుల
ననిం జంపించి గోవిందు డి
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్త్రునకుఁ
గల్పించెన్ మహాఖ్యాతిఁ జే
యించెన్ మూడు తురంగ మేధములు
దేవేంద్ర ప్రభావంబునన్.

## పుట 41 - గేయం 3

శ్రీకృష్ణుని రాయబారంలో ఆయన రాజకీయ చతురత స్పష్టం. అందులో సామాన్య మానవునిలాగా ఏదో సందేశం వినిపించటం గాదు. సమస్త విధి విధానం తన చేతిలోనే ఉన్నట్లుగా ధ్వనింపజేస్తాడు. తిరుపతి వేంకటకవుల ఉద్యోగ విజయ నాటకాలలో ఈ ఘట్టం, అట్టడుగు నున్న వ్యక్తికి కూడా విదితం గావటం విశేషం.

## పుట 41 - గేయం 4

సోదరు డెందుకు? సోదరి మనస్సు నెరిగి వాణ్ణే భర్తగా చేకూర్చటానికి.

రాజ్యం కోల్పోయిన పాండవులతో కాక, తన్ను స్తుతించే కౌరవులతో వియ్య మందాలన్న బలరాముని ఉబలాటం, డాంబిక ప్రవృత్తి, గర్హనీయం. మాయాబజార్ సినిమాలో ఈ మనఃప్రవృత్తి దర్శనీయం. ఎన్నిసార్లైనా చూడదగింది.

## పుట 41 - గేయం 5

"పూజనీయులైన పురుషుల లోపల
నెవ్వడయ్య కృష్ణు డిట్టి లేల
పూజ్యులైనవారి పూజింప నొల్లక
భీష్ము పనుపు జేసి బేలవైతి? (భాగ. సభా. ii-11)

అని ప్రశ్నించి, శ్రీకృష్ణ నింద గావించి, శిరచ్ఛేదన మనుభవించిన శిశుపాల వృత్తాంతం స్మరణీయం.

### పుట 42 - గేయం 1

"ఓయమ్మ! నీ కుమారుడు
మా యిండ్లను బాలుఁబెరుగు మననీడమ్మా!
పోయెద మెక్కడి కైనను
మా యన్నల సురభులాన మంజులవాణీ!! (x-329)

అనే పద్యం ఆంధ్రుల కత్యంత హృద్యం.

ఈ సందర్భంలో ఈ రచయిత వ్రాసిన 'సముత్సాహం' అనే గేయం చదవండి.

### పుట 43 - గేయాలు 2,3

ఇక్కడో కథ, ఎప్పుడో భవాన్ మాసపత్రికలో ప్రచురితం. శ్రీరాముడు జనించినపుడు, దేవతలందరూ అదృశ్యంగా వచ్చి రాముణ్ని అభినందిస్తున్నారు. కాని చంద్రుని ముఖం మాత్రం మ్లానంగా వుంది. అది గమనించి, శ్రీరాముడు ప్రశ్నిస్తే, నెమ్మదిగా తన మనోవేదన వ్యక్తంచేస్తాడు, చంద్రుడు.

పాపాలు విశేషంగా రాత్రుళ్లు జరుగుతాయి గదా! రాత్రి పుట్టి నిశాచర సంహారం చేయవలసిన రాముడు, పగలు పుట్టట మేమిటి? ఇది వంశకర్తపై చూపిన అభిమానం కాదా? అని ప్రశ్నిస్తాడు, చంద్రుడు. ఇందులోని సారస్యం గ్రహించిన రాముడు, జరిగినదానికి వింతించి, చంద్రుణ్ని ఓదార్చటానికి, వచ్చే అవతారం రాత్రే జరుగుతుందని అభయమిస్తాడు, శ్రీరాముడు. అయినా చంద్రుడు సంతృప్తుడు గాడు. అప్పుడు శ్రీరాముడు, తన పేరులో చంద్రుణ్ని కూడా కలుపుకొని వ్యవహృతుణ్ని అవుతాను, సంతృప్తేనా అంటే చంద్రుని ముఖం విప్పారిందట. రాముని స్వభావంలోని మార్దవత్వం విదితం చేస్తుందీ కథ.

శ్రీకృష్ణావతారంలో అన్నమాట ప్రకారం పరమేశ్వరుడు, రాత్రిపూట పుట్టి దుష్టసంహారం చేయటం విదితమే.

### పుట 43 - గేయం 4

ఇందులో కళాపూర్ణోదయ కావ్యంలోని ఉదంతం ప్రస్తావించబడింది.

నారద తుంబురులు సంగీత సహాధ్యాయులు. ఒకనాడు లక్ష్మీనారాయణులు కొలువుండి, ఏకాంతంగా తుంబురుణ్ని పిలిపించి, ఆయన వీణావాదన మాలకించి గొప్పగా సత్కరిస్తారు. ఇందుకు నారదుడు మత్సరిస్తాడు. తన

కంటే తుంబురు డెట్లా ఘనుడో తెలుసుకోవాలని అతని కుటీరానికి వెళ్తాడు నారదుడు. ముంగిలిలో వున్న వీణాతంత్రులు చిరుగాలికి శ్రుతిమనోహరంగా మ్రోగుతుండే విని, ఆశ్చర్యచకితుడై, తానా రీతిగా శ్రుతి కూడా చేయలేనే అని చింతించి, నారాయణుణ్ని గూర్చి తపస్సు చేస్తాడు. ఆయన ప్రత్యక్షమై కృష్ణావతారంలో అష్టమహిషులతో పాటు, నారదుణ్ని వీణాప్రవీణుణ్ని చేస్తానని మాట యిస్తాడు. ఆ మాట గుర్తుచేయటానికి వచ్చినట్లిక్కడ పేర్కొనబడింది.

పింగళిసూరన ఇక్కడో విద్యారహస్యం గుర్తుచేస్తాడు. మన విద్యాప్రదర్శనం అందరికీ, అన్నిచోట్ల ఒకేరీతిగా ఉండకూడదట. వినేవారి స్థాయినిబట్టి అది ప్రదర్శింతం కావాలి. 'ఉత్తముల మహిమ నీటికొలంది తామర సుమ్మీ!' అన్న అర్థాంతరన్యాసం మరువరానిది.

పుట 44 – గేయం 2

అన్ని విద్యలూ భగవంతుని నుండే ప్రభవించినా, మానవాకృతి వహించిన కారణంగా, కాశీలో సాందీపని గురుకులంలో, అన్న, కుచేలుడు (సుదాముడు) మున్నగువారితో పాటు శ్రీకృష్ణుడు వేదవేదాంగాది విద్య లభ్యసించాడు.

పోతనగారి పద్యా లాలకిద్దాం :

శా. "ఉర్విన్ మానవు లెవ్వరైన
 గురు వాక్యోద్యుక్తులై కాని త
ద్పూర్వారంభము సేయబోల రనుమన్
 బోధింప చందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై
 సంపూర్ణులై యుండియున్
గుర్వంగీకరణంబు సేయజని రా
 గోవిందుడున్, రాముడున్" (1407)

వ. చని, మహావైభవరాశియైన కాశిం జేరి, తత్తీరంబున నవంతీపుర నివాసియు, సకల విద్యావిలాసియునైన సాందీపని యను బుధవర్యునిం గని, యథోచితంబుగా దర్శించి, శుద్ధభావవర్తనంబుల భక్తి సేయుచుండ వారల వలన సంతుష్టుడై (1408)

శా. వేదశ్రేణియు, నంగకమ్ములు, ధనుర్వేదంబు, తంత్రంబు, మ
న్వాది వ్యాహృత ధర్మశాస్త్రములు, నుద్యన్న్యాయమున్, తర్కవి
ద్యాదక్షత్వము రాజనీతియును, షడ్గుణ్యంబు నెల్లం జెప్పె, నా
భూదేవాగ్రణి, రామకృష్ణులకు, సంభూత ప్రమోదంబునన్. (1409)

## పుట 44 - గేయం 4

64 విద్యలు, 64 దినాల్లో పూర్తికాగానే, ప్రభాసతీర్థంలో మునిగి మరణించిన తన కుమారుణ్ని గురుదక్షిణగా బ్రతికించి యిమ్మని సాందీపని కోరాడు. అపుడు రామకృష్ణులు రథారూఢులై సముద్రంలోకి పోయారు. తమ గురుపుత్రుణ్ని అప్పగించమని సముద్రుణ్ని అర్థించారు. అతడు యమసదనంలో ఉన్నాడని సముద్రుడు చెప్పాడు. అపుడు రామకృష్ణులు యమలోకానికి వెళ్లి శంఖం పూరించారు. యముడు భయపడి బాలకుణ్ని అప్పగించాడు. సాందీపనికి ఆ బాలకుణ్ని గురుదక్షిణగా సమర్పించి, గురుఋణం తీర్చుకొంటారు. (1403-1430)

గురువులంటే విప్రవర్యు లనే అర్థం గ్రహిస్తే ఇంకో కథ చెప్పుకోవచ్చు. ఒకానొక విప్రవర్యుడు తనకు గల్గిన సంతతిని పుట్టీపుట్టటంతోటే కోల్పోతున్నాడు.

అర్జునుడు ఒకసారి పుట్టిన బిడ్డను రక్షిస్తానని పూనుకొని రక్షించలేక, చనిపోయిన విప్రకుమారునితో పాటు తానూ యమలోకానికి పోతాడు. కాని అక్కడా శిశువు ప్రాణాలు కన్పించవు. అప్పు డర్జునుడు తన అసమర్థతకు బాధపడి, అవమానంతో అగ్నిప్రవేశం చేయటానికి ఉద్యుక్తుడౌతాడు. అపుడు శ్రీకృష్ణ డేతెంచి, అర్జునుణ్ని వారించి, అతణ్ని తీసుకొని నారాయణుణ్ని సందర్శిస్తాడు.

నారాయణుడు మందహాసంతో క్రూరరాక్షస సంహారం చేసిన నరనారాయణుల్ని సందర్శించాలని దివ్యమునులు కోరగా, అక్కడికి రప్పించానని, వారి కోర్కె తీరిందని, విప్రకుమారు లందరిని బ్రతికించి ఇస్తాడు.

విప్రవర్యు డానందించి శ్రీకృష్ణుణ్ని సంస్తుతిస్తాడు. (భాగ. x-1281-1320)

## పుట 44 - గేయం 5

శ్రీకృష్ణుడు సాందీపని శిష్యుడు. అర్జునునికి గీతోపదేశం కావించిన గురువు. వల్లవకుమారులకు, కుచేలుడికి (సుదాముడు) పరమమిత్రుడు. గోపికలకు, అష్టమహిషులకు, పదారువేల రాజకన్యలకు వారివారి మనోభీష్టానుసారం వర్తించిన ప్రణయమూర్తి. ఇంతటి ప్రణయ విరాణ్మూర్తి నానృతో దర్శనీయం.

## పుట 45 - గేయం 3

"కృష్ణం వందే జగద్గురుమ్" అని 'కృష్ణాష్టకమ్'.

పుట్టినప్పుడు జగత్తుకు బరువైనవాడని అర్థం. పెద్దై జగత్తుకంతకూ గురువై 'గీతాబోధన' చేసి, మానవుడు జీవిత కళాప్రపూర్ణుడు కావాలని ఆశించినవాడు - శ్రీకృష్ణుడు.

ప్రసిద్ధమైన శ్రీకృష్ణాష్టక శ్లోకా లాధారంగా ఈ రచయిత ఈ పద్యాలు రచించాడు.

## వందన మ్మో జగద్గురువర్య! కృష్ణ!!

"కంస చాణూర క్రూర రాక్షస వధార్థ
మవతరించితి, వసుదేవు నాత్మజునిగ;
దేవకీదేవి కానంద దీపమగుచు
వందన మ్మో జగద్గురువర్య! కృష్ణ!!

అతసి పుష్ప సంకాశ శోభిత శరీర!
హారనూపుర మణికుండ లాభిరామ!
రత్న కేయూర బాహు వినూత్న కాంతి!
వందన మ్మో జగద్గురువర్య! కృష్ణ!!

ముద్దమందార సుమగంధ ముదిత హృదయ!
చారు దరహాస దివ్య ముఖారవింద!!
బర్హిపింఛావతంస! శుభప్రదాయి!!
వందన మ్మో జగద్గురువర్య! కృష్ణ!!

నీల జీమూత సంఘ సన్నిభ శరీర!
పద్మపత్రాయతాక్ష! సంపన్నమూర్తి!
యదుకులాంభోధి చంద్ర! హ్లాదైక చరిత!!
వందన మ్మో జగద్గురువర్య! కృష్ణ!!

కుటిల కోమల కుంతల నిటలదేశ!
పూర్ణచంద్ర నిభాన నాకర్ణనేత్ర!
శంఖ చక్ర గదా శార్ఙ్గ చతురహస్త!
వందన మ్మో జగద్గురువర్య! కృష్ణ!!

రుక్మిణీదేవి రతికేళి రుచిమ దాత్మ!
తులసిదళ దామ సౌందర్య కలిత వక్ష!!
పీత వస్త్రైక ధారణ ప్రీత చిత్త!
వందన మ్మో జగద్గురువర్య! కృష్ణ!!

గోపికా కుచద్వంద్వ కుంకుమ విలేప
నాంకిత విశాల వక్షో విహార హార!
శ్రీనికేత! మహేష్వాస!! విద్విలాస!!
వందన మ్మోజగద్గురువర్య! కృష్ణ!!

రాసలీలా వినోద విభ్రాజమాన
నృత్త విన్యాస చిత్కళోదాత్త సత్త్వ!
వేణుగాన బ్రహ్మానంద వివశలోక!
వందన మ్మోజగద్గురువర్య! కృష్ణ!!

అద్భుతముగ కారాగారమందు పుట్టి
చోద్యముగ చేరినావు యశోద సరస;
గోప గోపీ జనాళికి ప్రాపువైతి
వందన మ్మోజగద్గురువర్య! కృష్ణ!!

బాలకుడు గానె సల్పితి లీల లెన్నొ!
మట్టుపెట్టితి రక్కస గుట్టులన్ని
బాలపరమేశ్వరా! మము నేల రమ్మ
వందన మ్మోజగద్గురువర్య! కృష్ణ!!

నీదు చిటికెనవ్రేలిపై నిల్పినావు
గొప్ప గోవర్ధనముకొండ, గొడుగు రీతి
దాన నేర్పడె పో 'గిరిధారి' బిరుదు
వందన మ్మోజగద్గురువర్య! కృష్ణ!!

విషము గ్రక్కెడి పాముపై వేగదూకి
నృత్త మొనరించితివి దాని నెత్తిమీద!
రమ్ము! నర్తింపగా నా శిరమ్ముపైని
వందన మ్మోజగద్గురువర్య! కృష్ణ!! (గౌరాంగ - మే, 1995)

పుట 45 - గేయం 5

ఇంద్రునకు, బ్రహ్మకు గర్వభంగమైన రెండు భాగవత వృత్తాంతాలు ఈ గేయంలో సూచితం :

ఇంద్రయాగం చేయాలని వచ్చిన నందాది గోపవృద్ధులతో కృష్ణుడు లోకం కర్మలో పుట్టి, కర్మలో పెరిగి, కర్మలో నశిస్తుంది గదా! ఈ యాగా లనవసరమని మాన్పిస్తాడు. అచలపూజ గావించండి చాలంటాడు. అందు కింద్రుడు కినిసి, గోవిందుని మందలన్నీ కొందల మొందేటట్లు వారి శిలావృష్టి గురిపించి నానాబీభత్సం చేస్తాడు. అప్పుడార్తితో :

"అక్కట వానదోగి వ్రజ
మాకుల మయ్యె గదయ్య! కృష్ణ! నీ
వెక్కడ నుంటి వింత తడ
వేల సహించితి, నీ పదాబ్జముల్
దిక్కుగ నున్న గోపకులు
దీనతనంద భయాపహారివై
గ్రక్కున గావ కిట్లునికి
కారుణికోత్తమ! నీకు పాడియే?" (905)

'కూయాలింపగదయ్యా! గుణరత్న నిధీ!!' అని శిలావర్ష హతులై శరణాగతులైన ఘోష జనుల్ని రక్షించటాని కుద్యమించి, హరి

"కలగకుడీ! వధుజనులు,
కంపము నందకుడీ వ్రజేశ్వరుల్
తలగకుడీ! కుమారకులు
తక్కినవారలు జాలవానచే
నలగకుడీ! పశువ్రజము
నక్కడ నక్కడ నిల్వనీకుడీ
మెలపున మీకు నీశ్వరుడు
మే లొసగుం గరుణార్ద్ర చిత్తుడై" (912)

అని, అభయ మిచ్చి, ఎప్పుడో భూమినెత్తిన కిరిలాగా, ఎప్పుడూ తొండంతో పద్మాన్ని పట్టే ఏనుగులాగా గోవర్ధనగిరి నెత్తిపట్టాడు, ఛత్రంలాగా.

పర్వతం ఎక్కడ పడిపోతుందో అని భయపడే వ్రజాని కిరీటిగా కృష్ణుడు ధైర్యం చేకూరుస్తాడు :

"బాలుం డీతడు, కొండ దొడ్డది
మహాభారంబు సైరింపగా
జాలం డోయని దీని క్రింద నిలువన్
శంకింపగా బోల దీ

శైలాంభోనిధి ఖండమంతయును త
ద్భూతాంగము శైశవక్షమా
కే లీలాడదము, బంధులారా!
నిలువుడీ! క్రిందం బ్రమోదంబునన్" (920)

కొండక్రింద గోపజనులు జనార్దన కరుణా విలోకనామృత వర్షం చేత ఆకలి నీరు పట్టుల చొప్పు తెలియక కృష్ణకథా వినోదులైనారు. ఇలా ఏడహోరాత్రాలు గడిచాయి. గిరిభేది విసుగుజెందాడు. వాన ఆగిపోయింది. ఈవిధంగా ఈ వృత్తాంతం వల్ల ఇంద్రుని గర్వభంగంతో పాటు గోపజనుల్లో భగవద్విశ్వాసం ప్రగాఢమైనాయి. ఏకక్రియా ద్వ్యర్థకరీ!

బ్రహ్మ గర్వభంగం : ఇదో విచిత్ర సంఘటన. ఇదే ముందు జరిగిన వృత్తాంతం. అంబుజసంభవుడికి మాయాబాలుని శుంభద్బలం ఆలోకించాలనే తలంపు గల్గి గోవత్సాల్ని, గోపబాలకుల్ని అంతర్ధానం చేస్తాడు. అప్పుడు శ్రీకృష్ణుడే, గోపాలకులు, గోపికలు సంతోషపడేటట్లు, తానే గోపబాలుర, గోవుల రూపులు ధరించాడు.

"కరములఁ బాదములున్ శిరంబు
లవలగ్నంబులఁ, ముఖంబులఁ భుజాం
తరములఁ ముక్కులు కన్నులున్
శ్రవణములఁ దంతాదులున్ దండకాం
బర స్రగ్వేణు విషాణ భూషణ
వయోభాషా గుణాఖ్యాన త
త్పరతల్ వీడ్వడకుండ దాల్చె
విభుడా వత్సార్భ కాకారముల్" (511)

రూపంబులెల్లనగు బహురూపకు డిటు బాలవత్స రూపంబులతో నేపార్చు డేమి సేద్యము? రూపింపగ నతని కితర రూపము గలదే?" (512) అతనే ౦రలించేవాడు, అతనే మరలింపబడేవాడు. తల్లులకు పిల్లలు ఇంతకు పూర్వం ౦టే ఎంతో ఆహ్లాదంగా ఉన్నారు. బ్రహ్మ ఆ గోగోపాల రూపంలో ప్రకా ౦చే పరమాత్మను జూచి పరమానందభరితుడైనాడు. ఆయన దుడుకుతనం ౦యింది. కృతాంజలియై డగ్గుత్తికతో ఏకచిత్తంతో చతుర్ముఖాలతో సంస్తుతి ౦వించాడు, ఆ శ్రీకృష్ణ పరమాత్మను.

లోకంలో సాకారోపాసన మందాధికారుల కనే యభిప్రాయముంది. కాని ౦హ్మదేవు డంటాడు :

"....నీ నిర్గుణశ్రీ విభూతి
బహిరంగ వీధుల బాటిక దిరముల్రై
యమలంబులగు నింద్రియముల చేత
నెట్టకేలక్తైన నెఱుగంగనగు గాని
గుణవిలాసి వగుచు, కొమరు మిగులు
నీ గుణ్యావజంబు నేరరాదెఱుగంగ
ఒక్కమితము లేక యుంట నీశ!" (553)

ఈవిధంగా బ్రహ్మ అహంకారం గూడా అణగద్రొక్కి, మనుజరూపంలో భూమిమీద ఉన్నా తానే దేవాధి దేవుణ్ణనే భావం సుస్థాపితం కావించాడు కృష్ణపరమాత్మ.

పుట 46 - గేయాలు 1, 2

పంచ విధ భక్తిభావాల్లో శాంతభక్తి మొదటిది. ఈ భక్తికి సర్వం వాసుదేవమయ మనే భావం ప్రధానం. నిత్యానంద స్వరూపుడైన భగవంతుని గూర్చిన నిరంతర భావన కావాలి. మోక్షం కూడ అపేక్షించకూడదు.

శ్లో. ఆత్మారామాశ్చ మునయః
నిర్గ్రంధాఽప్యురుక్రమే
కుర్వం త్యహైతుకం భక్తిం
ఇత్థం భూత గుణో హరిః.

కం. ధీరులు నిరపేక్షులు నా
త్మారాములునైన మునులు హరిభజనము ని
ష్కారణము సేయుచుందురు
నారాయణు డట్టివాడు నవ్యచరిత్రా!!

ఈ శాంతభక్తిలో సాన్నిధ్యం లేదు. నిరంతర సేవకు సాన్నిధ్యం కావాలి. తక్కిన దాస్యభక్తిలోను, వాత్సల్య సఖ్యభక్తుల్లోను ఈ సాన్నిధ్యం ఉత్తరోత్తర అధికం. మధురభక్తిలో అది అత్యంతంగా ఉంటుంది. దాస్యరసభక్తి, వాత్సల్య, సఖ్య, మధురరస భక్తుల్లోను ఉంటుంది.

వాత్సల్యమంటే దాస్యం+వాత్సల్యం.

సఖ్యమంటే దాస్యం+వాత్సల్యం+సఖ్యం.

మధురమంటే దాస్యం+వాత్సల్యం+సఖ్యం+మధురం.

శాంతభక్తిలో ప్రేమున్నా సాన్నిధ్యం లేదు. దాస్యంలో ప్రేమ, సాన్నిధ్యాలున్నా చనువు లేదు. భయమెక్కువ. వాత్సల్యంలో ప్రేమ, సాన్నిధ్యం, చనువులున్నా సమానత్వం లేదు. సఖ్యంలో ప్రేమ, చనువు, సమానత్వాలున్నా అత్యంత సాన్నిధ్యముండదు. మధురభక్తిలో ప్రేమ, చనువు, సమానత్వం, అత్యంత సాన్నిధ్యం అత్యధికం. అందుకే గోపికా భక్తి పరాకాష్ఠ. ఈవిధంగా ఈ భక్తిభావా లుత్తరోత్తర గరీయం. భాగవతంలో ఇవన్నీ రససిద్ధి పొందుతాయి.

## పుట 46 - గేయం 3

మనం సంసారంలో ఉండవచ్చు కానీ, సంసారం మనలో ఉండ రా దంటారు, రామకృష్ణపరమహంస. అంటే సంసారంలో ఉంటున్నా, మనస్సు పరమేశ్వరునిపైన నిమగ్నం కావాలి. ఏవిధంగా నంటే, దీనికి జగన్నాథపండిత రాయలవా రో శ్లోకం చెప్పారు; ఉపమానపూర్వకంగా :

*"పుంఖానుపుంఖ విషయేక్షణ తత్పరోపి*
*బ్రహ్మావలోకన ధియం, న జహాతి యోగీ!*
*సంగీత తాళ లయ నృత్త వశంకరోపి*
*మౌళిస్థ కుంభ పరిరక్షణ ధీ నటీవ"*

విషయవాసనా పరంపరలతో కొట్టుమిట్టాడుతున్నా, యోగియైన వాని మనస్సు, బ్రహ్మదర్శనం చేస్తూనే ఉంటుంది. ఏవిధంగా నంటే - నర్తకిలాగా. లయానుకూలంగా, పాటలోని భావం పరిపోషిస్తూ నర్తిస్తున్నా నర్తకి ఏకాగ్ర తంతా నెత్తిమీదున్న పాత్ర పడిపోకుండా చూసుకొంటుంది. ఆరీతి నైపుణ్యం సంపాదించాలి, సంసారులు.

రామకృష్ణపరమహంస ఇంకో ఉదాహరణ మిచ్చారు. శ్రీమంతుల యిండ్లల్లో దాదులు, పిల్లల పోషణ బాధ్యత వహించి, వారి సేవలో మగ్నులైనా వారి మనస్సులు తమ యిండ్లలో పెరిగే తమ సంతతి మీదనే. ఇటువంటిది నిరంతర భక్తి.

త్యాగరాజస్వామి అంటారు : "సంసారులైతే నేమయ్యా! శిఖిపింఛావతంసు డెదుట నుండగ".

## పుట 46 - గేయం 4

అందరి నర్తన భూమిమీద సాగితే, ఈ బాలకుని నర్తన కాళియసర్పపు పడగలమీద సాగింది. ఇందులో కాళియమర్దన కథ సూచితం.

కాళియూహి మడుగు నీరు త్రాగినా, దాని గాలి సోకినా ప్రాణాలుం డవు. గోపకుమారు లా మడుగునీరు త్రావి ప్రాణాలు కోల్పోయారు. అది విని, బాలకృష్ణు డా మడుగులోకి దూకి, ఏందరవందర చేసాడు. కాళియఫణి, బాలుణ్ని కరచి, పడగంతో చుట్టింది. అది గమనించిన గోపకుమారులు, గోవులు దుఃఖించాయి. వ్రజమంతా కదలివచ్చింది, విషాదంతో.

కృష్ణుడు తన మేను పెంచి, దాని పట్టునుండి తప్పించుకొన్నాడు. ఒక చేత్తో దాని దవడ పట్టి జరజరా త్రిప్పాడు. ఆమీద దాని పడగలపై కెక్కి నృత్తం చేసాడు. ఆ నర్తన సభ ఎలా రక్తికట్టిందో పోతనార్యుని హృద్యాతిహృద్య పద్యం ఆలకిద్దాం :

సీ. ఘన యమునానదీ కల్లోల ఘోషంబు
సరస మృదంగ ఘోషంబు గాగ
సాధు బృందావన చర వంచరీక గా
నంబు గాయక సుగానంబు గాగ
కలహంస సారస కమనీయ మంజు శ
బ్దంబులు తాళ శబ్దములు గాగ
దివి నుండి వీక్షింప దివిజ గంధర్వాది
జనులు సభాసీన జనులు గాగ
పద్మ రాగాది రత్న ప్రభా సమాన
మహిత కాళియ ఫణి ఫణా మండపమున
నళిన లోచన విఖ్యాత నాయకుండు
నిత్య నైపుణ్యమున వేర్చి నృత్యమాడె" (నృత్త మనుట మేలు) (664)

పుట 47 – గేయం 1

64 కళలు : వీటిలో మల్లశాస్త్రం, నాట్యం, యోగం, జారత్వం, దొంగతన మిత్యాదులున్నాయి.

"అరువది నాలుగు విద్యలు
అరువది నాలుగు దినంబు లంతని వారల్
నెరవాదులైన కతమున
నెరి నాక్కొకనాటె వినికి నేర్చి రిలేశా! (1410)

పుట 47 – గేయం 5

సప్త భువనాలు : భూలోకం, భువర్లోకం, స్వర్లోకం, మహర్లోకం, జనో లోకం, తపోలోకం.

సప్త అధోలోకాలు : అతలం, వితలం, సుతలం, తలాతలం, రసాతలం, మహాతలం, పాతాళం.

పుట 48 - గేయం 1

చైతన్య శబ్దం చేత, చైతన్యమహాప్రభువు స్మరణీయుడు.

పుట 48 - గేయం 3

బాలు డింత వా డంత వాడనటం, దురాశగా భావించవద్దు. గోపికల ఆశాకోరకా లన్నీ క్రమంగా వికసించుతాయి, అంతరంగ స్ఫూర్తితో పలికే పలుకులివి.

పుట 49 - గేయం 1

ఉద్ధవునిచేత వేదాంతం చెప్పించటం, అర్జునుడికి గీతాబోధ కావించటం. ప్రేమభక్తికి బోధలు కర్ణకఠోరంగా ఉంటాయి.

భగవద్గీత అందరూ అర్థమైనట్లే ఉట్టంకిస్తారు.

విఘ్నేశ్వరీయం ఏమంటుంది?

"భూమిని సంతటినీ బంగారంతో అలకవచ్చు, సముద్రపు నీటిని మంచినీరుగా మార్చవచ్చు కాని గీత నర్థం చేసుకోలేం".

పుట 49 - గేయం 5

"భూసతికిం దివంబునకు బొల్పెసగంగ, శరత్ సమాగమం బాసకల ప్రమోద కరమై విలసిల్లె" అని నన్నయభట్టారకుడు శరద్వర్ణనం చేస్తాడు. శరత్కాలంలోనే రాసలీల జరుగుతుంది. చరాచర జగత్తును సమ్మోదపరచే శక్తి గలవాడు శ్రీకృష్ణుడే.

పుట 58 - గేయం 2

"ప్రకృతి వత్ వికృతిః" అని పూర్వమీమాంసా సూత్రం. ప్రకృతి సంరక్షణం పెద్ద సమస్య. నాగరకత వృద్ధి అవుతుండే గాలి, నీరు, వాతావరణం కల్మషమై అనేక అరిష్టాలకు దారితీస్తాయి.

పుట 58 - గేయం 5

| | | | |
|---|---|---|---|
| బృందావన కృష్ణుడు | – | ప్రకృతి | రెండూ పరమాత్మే గా |
| భారత కృష్ణుడు | – | వికృతి | |

బృందావనం వీడిన తరువాత, శ్రీకృష్ణుడు ఉద్ధవుని ద్వారా గోపికల వేదాంత సందేశం పంపుతాడు. జీవన దివ్య మాధుర్యానుభవ వైముఖ్యా వేదాంతంగా పరిగణిస్తారు - గోపికలు.

"నిగమమే బ్రహ్మమును, నిఖిలాంతరాత్మయని
అగముడని, వాఙ్మన సాతీత రూపుడని
తుద మొదల్ గనరాని, లోపు నంటను రాని
వెదకి కానగరాని, వింత వేల్పనువాని
అగుణు నారాధింప నరవేతి ఉసిరకలు
సుగములను, సగటులును, సుకృతార్థకామములు"

అని ఉద్ధవుడెంత యమృతంబు లొలుకుమను
గొనియాడుగాక నిర్గుణు బెద్ద సేయుమను
పొలుపడి యోగసముపాసనదు బ్రాల్మాలి
కొలుపదుదుమె మేము, గోపాలు వనమాలి?

(సూరసాగరం ఆంధ్రీకర్త : మైంపరప్ సూర్యనారాయణమూర్తి, 1992, గేయం-96

## పుట 59 - గేయాలు 1, 2

"న వినా విప్ర లంభేణ, శృంగారం పుష్టి మశ్నుతే" అని అలంకారశాస్త్రం సంయోగ శృంగారం, కాలం గడిచేకొద్దీ తరిగిపోతుంది. వియోగ శృంగారం కాలం గడిచేకొద్దీ వేడెక్కి, వాడితేలుతుంది.

పగడపూలు, వాడిపోయి విశేషంగా వాసిస్తాయి.

## పుట 60 - గేయం 3

బాలకృష్ణుని మీద జానపదులు పాడిన పాట లెన్నో ఉన్నాయి. అవన్నీ గోపికల వంటి స్వచ్ఛమైన మనస్సులు కలవారు కట్టినవే. గేయాలు కొన్ని :

### చిన్నికృష్ణుడు

చిన్నికృష్ణుడు పుట్టాడు
చిటపట పువ్వులు కురిశాయి.
చిన్నికృష్ణుడు నవ్వాడు
తళతళ మెరుపులు మెరిశాయి.
చిన్నికృష్ణుడు నడిచాడు
చప్పట్లు కొట్టింది భూదేవి.

చిన్నికృష్ణుడు ఆడాడు
అప్పుడే ఆటలు పుట్టాయి.
చిన్నికృష్ణుడు పాడాడు
అప్పుడే పాటలు పుట్టాయి.

ఆటలు, పాటలు చిన్నికృష్ణుని తోనే ఏర్పడ్డాయనటం ఎంత మనోజ్ఞ భావనో! ఆయన ఆడింది ఆట. పాడింది పాట. ఓహో!!

## కృష్ణమ్మ

వంకలోని పిల్లవాడు
వల్లనైన పిల్లవాడు
నల్లటి పిల్లవాడు
నవ్వులొల్కె పిల్లవాడు
నమ్మరాని పిల్లవాడు
వాడె వాడె వాడె వాడె
వాడె వాడె గోపమ్మా!
వాడేనే! వాడేనే!!
వాడేనే! కృష్ణమ్మ!!

'అమ్మ' స్త్రీవాచకమైనా, ఆప్యాయార్థంలో పురుషవాచకాల మీద కూడా చేరుస్తాం. "కిట్టమ్మా! గోపాలబాల కిట్టమ్మా" అనే చెక్కభజన చాలా బాగుంటుంది.

## వీడే నమ్మా! కృష్ణమ్మ!!

వీడే నమ్మా! కృష్ణమ్మ!
వీడే వీడే కృష్ణమ్మ!!
కాళ్లకు గజ్జెలు చూడండి
మెడల్లో గంటలు చూడండి
మెళ్లో హారం చూడండి
తల్లో పింఛం చూడండి
వీడే నమ్మ కృష్ణమ్మ!
వీడే అల్లరి కృష్ణమ్మ!!

శ్యామల దేహం చూడండే
తామర కన్నులు చూడండే
సుందర వదనం చూడండే
మందహాసం చూడండే
వీడే నమ్మా కృష్ణమ్మ!
వీడే వీడే కృష్ణమ్మ!!
వీడే వీడే కృష్ణమ్మ!
వీడే అల్లరి కృష్ణమ్మ!!

పొన్నలు ఎక్కే కృష్ణమ్మ
వెన్నలు మెక్కే కృష్ణమ్మ
వేణువు నూదే కృష్ణమ్మ
గోవులు కాసే కృష్ణమ్మ
వీడే వీడే కృష్ణమ్మ!
వీడే అల్లరి కృష్ణమ్మ!!

ఘల్లికిదె చేయూత నడవండే
అల్లరి కృష్ణుని పట్టండే
పట్టండే పట్టండే
పట్టిన కృష్ణుని విడవండే
కమ్మగ తీంగా చూడండే
కౌగిలిలో చేరపెట్టండే.
వీడే నమ్మా కృష్ణమ్మ
వీడే వీడే కృష్ణమ్మ
వీడే ముద్దుల కృష్ణమ్మ.

## కృష్ణమ్మ కొడుకు

['కృష్ణమ్మ' అంటే కృష్ణుని అమ్మ. 'యశోద' అని అనకుండా 'కృష్ణమ
అనటం విచిత్రం]

కృష్ణమ్మ కో చిన్నికొడుకు పుట్టాడె!
ఆ కొడుకు నెత్తుకొందాము రారమ్మ!!

కొడుకంటె కొడుకటే, గారాల కూచి!
ముత్యాలహారమే, ముద్దుల మూటే!! ...కృష్ణమ్మ

రకరకము విద్దెల్లు మాపుతున్నాడే!
వికవికా పకపకా నవ్వుతున్నాడే!! ...కృష్ణమ్మ

విచ్చివేలుబు తట్టి ఆడుతున్నాడే!
భోసినవ్వులు వెళ్లబోయుమన్నాడే!! ...కృష్ణమ్మ

వల్లన్ని మాపుల్లు వల్లుతున్నాడే!
ఇల్లంత వెన్నెల్లు కాయుమన్నాడే!! ...కృష్ణమ్మ

ఆ కళ్లు, ఆ మొహం, ఆ జుట్టు తీరు!
అచ్చంగ కృష్ణమ్మ పోలికే నమ్మా!! ...కృష్ణమ్మ

పూల టోపీ అల్లి తీసుకురా రండి!
పట్టు జుబ్బా కుట్టి పట్టుకురా రండి!! ...కృష్ణమ్మ

కృష్ణమ్మ పుత్రుడికి ముస్తాబు చేసి!
అందరూ ఎత్తుకొని ముద్దాడుదాము!! ...కృష్ణమ్మ

అందరూ ఈ కొడుకు నెత్తుకో రండి!
ముద్దుల్లు కొల్లగా పెట్టుకో రండి!! ...కృష్ణమ్మ

కొడుకు నెత్తుకొని ముద్దాడు వేళ!
హృదయాలు ఉప్పొంగి ఉప్పొంగి పోవు!! ...కృష్ణమ్మ

ఇవి నిసర్గ మనోహర భక్తిభావాలు. ఇట్టి వెన్నెన్నో!!

## పుట 60 – గేయం 2

బాల మనోహర జీవితం అత్యద్భుతమైంది. భావ ప్రధానమైంది. ఎదిగే కొద్దీ, జీవితం యాంత్రికమౌతుంది. ఎంతగా మనిషి ఎదిగినా, అతనిలోని బాల భావన తరగకుండా మాచుకోవాలి. నవ వికసిత కుసుమం లాగా సుకోమలమ్ము, సుప్రభాత మారుతం లాగా సుమనోజ్ఞము, స్ఫటికశిల లాగా స్వచ్ఛమూ నయిన బాల్యభావన ఆజీవితం పోషించుకోవాలంటాడు శ్రీరామకృష్ణ పరమహంస.

పుదుచ్చేరి శ్రీమాత పల్కు లాలకించండి :

"Wh is God, after all!
An eternal child, playing an eternal game in an eternal garden"

పుట 60 - గేయం 4

రాస పంచాధ్యాయిలో శ్రీకృష్ణుడు గోపికలతో జరిపిన రాసలీల 'కామ విజయం'గా పేర్కొనబడింది. దశమ స్కంధానికి ప్రాణమైన రాస పంచాధ్యాయి పఠిస్తే 'కామవిజయం' కల్గుతుందని చెప్పబడింది. ఎక్కడైనా కామ ప్రసంగం వల్ల కామం వృద్ధి అవుతుంది గాని విజయం కల్గుతుందా? ఇది పైకి కామప్రసంగమే కానీ, ఇది నిజానికి విషయ సుఖ విరహిత అప్రాకృత గుణాతీత ప్రేమ. (చూ. ప్రేమభక్తి - కులపతి శ్రీ కుందుర్తి వేంకటనరసయ్యగారు పుటలు 65, 66).

శ్రీమద్భాగవతంలోని రాస పంచాధ్యాయి ప్రారంభంలో వ్యాఖ్యాత శ్రీధర స్వామివా రిట్లా వ్రాసారు :

"నను విపరీత మిదం. పర దారాది వినోదేన కందర్ప జితత్వ ప్రతీతే మైవం, "యోగమాయా ముపాశ్రితః", "ఆత్మారామోప్యపీరమత్", "సాక్షాన్మన్మథ మన్మథః", "ఆత్మ న్యవ రుద్ధ సౌరతః" ఇత్యాదిషు స్వాతంత్ర్యాభిధానాత్. తస్మా ద్రాసక్రీడా విడంబనం కామవిజయ ఖ్యాపనా యేత్యేవ తత్త్వం. కించ శృంగార కథాపదేశేన విషయతో నివృత్తి పరేయం పంచాధ్యాయీ వ్యక్తీ కరిష్యామః. (శ్రీమద్భాగవతే దశమ స్కంధే, 29 అధ్యాయే భావార్థదీపికా - పుట 306).

32 వ అధ్యాయాంతంలో రాస పంచాధ్యాయి చివర గల 41 వ శ్లోకం

"విక్రీడితం వ్రజ వధూభి రిదంచ విష్ణోః
శ్రద్ధాన్వితోను శృణు యా దను వర్ణయేద్యః
భక్తిం పరాం భగవతి ప్రతిలభ్య కామం
హృద్రోగ మాశ్వపహినో త్యచిరేణ ధీరః"

దీన్ని వ్యాఖ్యానిస్తూ శ్రీధరస్వామి యిలా అన్నారు :

"భగవతః కామ విజయరూప రాసక్రీడా శ్రవణాదేః 'కామవిజయమేవ' ఫ మాహ విక్రీడితమితి. అచిరేణ ధీరస్సన్ హృద్రోగం కామం ఆశు అపహినోతి పరిత్యజ తీతి".

ఈ విషయం దయతో అందించినవారు బ్రహ్మశ్రీ జొన్నాభట్ల వీరేశ్వ శాస్త్రివర్యులు. "అంతే కాని 'కామవిజయ' మను మాట మూలము నంద కానరాలేదు" అని కూడ శ్రీ శాస్త్రిగారు తెలియజేసారు. వారికి కృతజ్ఞను.

### పుట 65 - గేయం 1

నామ సంకీర్తన ప్రాశస్త్యం, సందర్భమంతగా ఉన్నా లేకపోయినా, బమ్మెర పోతన, తన భాగవతంలో చాటారు :

"బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్గి
కీలలు, హరినామ కీర్తనములు
గురు తల్ప కల్మష ఘోరసర్పములకు
కేకులు, హరినామ కీర్తనములు
తపనీయ చౌర్య సంతమసంబునకు సూర్య
కిరణముల్, హరినామ కీర్తనములు
మధుపాన కిల్బిష మదనాగ సమితికి
కేసరుల్, హరినామ కీర్తనములు

మహిత యోగోగ్ర నిత్య సమాధి విధుల
నందు బ్రహ్మాది సురలకు నందరాని
భూరి నిర్వాణ సామ్రాజ్య భోగ భాగ్య
ఫలనంబులు, హరినామ కీర్తనములు" (6-118)

ముక్తి కాంతైకాంత మోహన కృత్యముల్
గేలిమై హరినామ కీర్తనములు
సత్యలోకానంద సౌభాగ్య యుక్తముల్
గేలిమై హరినామ కీర్తనములు
మహిత నిర్వాణ సామ్రాజ్యాభిషిక్తముల్
గేలిమై హరినామ కీర్తనములు
బహుకాల జనిత తపఃఫల సారముల్
గేలిమై హరినామ కీర్తనములు

పుణ్యమూలంబు లనపాయ పోషకంబు
లభిమతార్థంబు లజ్ఞాన హరణ కరము
లాగ మాంతోపలబ్ధంబు లమృత సేవ
లార్త శుభములు హరినామ కీర్తనములు. (6-119)

పాతకుండ, ఖలుడ, బ్రహ్మఘాతకుడను
మాన లోభ మోహ మత్సరుండ
నాకు నెట్లు దొరకు నారాయణుని దివ్య
నామ విమల కీర్తనంబు మదికి. (6-145)

ఒక పర్యాయం నారదుడు, నారాయణుణ్ణి తన విరునామా చెప్పమంటే, ఆయన ఇలా చెప్పారట :

"నాహం వసామి వైకుంఠే
న యోగి హృదయేషు చ
మద్భక్తాః యత్ర గాయన్తి
తత్ర తిష్ఠామి నారద!"

"యత్ర యత్ర రఘునాథ కీర్తనమ్
తత్ర తత్ర కృతమస్త కాంజలిమ్
బాష్పవారి పరిపూర్ణ లోచనమ్
మారుతిం నమత రాక్షసాంతకమ్" అనే శ్లోకం కూడా యీ సంకీర్తన భక్తి ప్రశస్తిని చాటుతుంది.

చైతన్య మహాప్రభువులు సంకీర్తన భక్తికి ప్రాణం పోశారు. కలికాలంలో ధ్యానాదులు చేయలేని అలసులకు, మందభాగ్యులకు, ఉగ్రరోగ సంకలితులకు నామ సంకీర్తనమే సులభ తరణోపాయం.

### పుట 65 - గేయాలు 3, 4

బాలకృష్ణుడు, గోపకుమారులతో వనంలో చల్ది లారగించిన ఘట్టం, ఊరగాయ ముక్కలు, వ్రేళ్ల సందుల్లో పెట్టుకొని, మధ్యమధ్య నంజుకోటం, తెలుగుదనాన్ని బాగా ప్రతిఫలించే రసవత్తర ఘట్టం (10-456). వారి ఆటలు తెలుగువారి ఆటలే (457-60). ఆ ఆటల్లో బాలకృష్ణుణ్ణి దొంగచేసి, గోపకుమారు లెంత హింసించినా ఆతడెట్లా సహించాడో! చూడండి!!

"ఎన్నఁడునైన యోగి విభు
లెవ్వని పాదపరాగ మింతయుం
గన్నుల గాన రట్టి హరి
గాగిట చేర్చుచు చెట్టపట్టుచుం
దన్నుచు గ్రుద్దుచున్ నగుచు
దద్దయు వైచుచు గూడి యాడుచున్
మన్ననసేయు వల్లవ
కుమారుల భాగ్యము లింత యొప్పునే? (x-461)

విందులకును బ్రహ్మ సుఖా
నందంబై భక్తగణమునకు దైవతమై
మందులకు బాలుడగు హరి
పొందు గనిరి గొల్ల లిట్టి పుణ్యులు గలరే? (462)

పుట 65 = గేయం 5

జగద్విదితమైన కుచేలోపాఖ్యానం ఇందులో సూచితం:

"మురహరుడు పీడికై చదుకుటుల
కర మొప్పగ నారగించి కౌతూహలిమై
మరియును బిడికెడు గొన త
త్కరి మడ్డుడు పట్టె కమల కరకమలమునన్" (x-1013)

"సొంపారగ నతనికి బహు
సంపద లందింప నివియ చాలును నిక భ
క్తింపగ వలవదు త్రిజగ
త్సంపత్కర! దేవదేవ! సర్వాత్మ హరీ!!" (1014)

"ఇక్కుచేలుండు నిజహృదయాపూతోల్లాసంబు కొరకు నా యొద్దకు వను దెంచిన వా డితనికి ఇంద్రాదులకుం బడయరాని బహువిధంబులైన సంపద్విశేషంబు లొసగంగ వలయునని" అనుకుంటాడని ఈరీతిగా చేకూర్చాడు శ్రీకృష్ణుడు. సంపదల సంగతి తారేదని కుచేలుడు ఈరీతిగా తనలో తానిట్లా అనుకుంటాడు :

"శ్రీనిధి యిట్లు నన్ను పవరించి
ఘనంబుగ విత్తమేమియు
న్నీని తెరంగు గానబడె
నెన్న దరిద్రుడు సంపదంధుడై
కానక తన్ను చేరడని కాక
స్థిరార్తి హరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరి
పూర్ణునిగా నను జేయకుండునే? (x-1019)

పుట 67 - గేయాలు 3, 4

ఈ రచయిత అనేక సభల్లో చదివే ఈ పద్యాలు కవిసమ్రాట్ విశ్వనాథవారి శృంగారవీధి లోనివి. ఆ స్ఫూర్తితో యీ గేయం వెలువడి ఉంటుంది.

## బ్రహ్మగీతము

వేణువు బ్రహ్మగీతము
వెలింబడెనో స్మృతి తప్పి గోపికా
శ్రేణులు నీ పదం బభిలషించిరి
గేహములం దనూజులన్

ప్రాణపతుల్ తదీయ విర
హార్తికి నేమయినారొ! యెంత పా
షాణుడవో; పురానుగత
సంధులు వ్రయ్యలుసేయ మాధవా!!

దొన దొన జారు బాష్పములు
దోసిట బూని భవత్పదాభిషే
కనియతి వచ్చుచున్న
వ్రజకన్యలు బృందము త్రోవ తప్పిరో
యని మదినైన నెంచవవురా!
తరి విక్కని గున్నపాలు త్రా
విన చిరుబొజ్జలో కలక
వెట్టదురా! జగదేకసుందరా!!

మధురమురా! మురాసుర
విమర్దన నీదగు బ్రహ్మగీతి, నీ
యధరమురా! పురాకృత
మహాసుకృతంబు గడించుకొన్న దీ
ర్ఘధనవ మేఖలల్ వ్రజ
విలాసిను లంబుధరాకృతిన్ నినున్
పృథివికి కంపలై డిగి
వరింపగ వచ్చిరిరా వ్రజేశ్వరా!

ఇట్లా యీ పద్యా లెంతో హృద్యంగా, ఆత్మాశ్రయ ధర్మంగల్గి అతిభాగవతంగా సాగాయి.

"పరువు పరువున వచ్చి పాదాలపై బడితి", "ఈ వేణురవము, నా జీవనాదుల జొచ్చి" వంటి గేయాలు ఇందులోనే ఉన్నాయి చదవండి.

పుట 68 - గేయాలు 1, 2

భక్తుడికి జీవితం మీద విరక్తి, వైరాగ్యాలుండవు. చిరకాలం భగవత్సేవలో జీవించాలని అతని ఆకాంక్ష. శరీరాన్ని చక్కగా పోషించుకొంటాడు. భగవత్ప్రసాదం స్వీకరిస్తూ; సర్వేంద్రియాలు పుష్టిగావించుకొని, భగవత్సేవలో వాటికి తగిన భాగం చేకూరుస్తాడు. "హృషీకేన హృషీకేశ సేవనం, భక్తిరిత్యుచ్యతే" అని విష్ణుపురాణం. భాగవతం ఉద్ఘాటించేది ఈ విషయాన్నే ప్రధానంగా :

"నీ పద్యావళు లాలకించు చెవులున్
నిన్నాడు వాక్యంబులున్
నీ పేరం బని సేయు హస్తయుగముల్
నీ మూర్తిపై చూపులున్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్
నీ సేవపై చిత్తముల్
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్
నీరేజ పత్రేక్షణా!!" (x-408)

పుట 70 - గేయం 3

జడాలు చేతనాలుగాను, చేతనాలు జడాలుగాను మార్చే మురలీనాద మహిమ నెందరెందరో అభివర్ణించారు.

"వేణునాదం బృందావనాన్ని పరిప్లావితం కావిస్తుంది. ఆకాశానికంటి మేఘాల్ని స్తంభీభూతం చేస్తుంది. స్వర్గలోక గాయకుడైన తంబురుణ్ని మాటి మాటికి చకితుణ్నొనర్చుతుంది. బ్రహ్మలోకంలోని సనక సనందన సనత్కుమార సనత్సుజాతాది మహామునుల నిర్బీజ సమాధిని భంగిస్తుంది. బ్రహ్మదేవుడికి విస్మయం కలిగిస్తూ ఊర్ధ్వలోకంలో తన విజయపతాకను నిల్పుతుంది. ఆ తరువాత అధోలోకమైన పాతాళానికి పోయి, అచటి బలిచక్రవర్తిని ఉలికిపడ చేస్తుంది. భోగీంద్రుడయిన శేషుణ్ని సహస్ర ఫణాలతో ఊగింపజేస్తుంది. ఆపైని అఖిల బ్రహ్మాండ కటాహం భేదించి సర్వదిశల్లో వ్యాపిస్తుంది" అనే వర్ణన అత్యద్భుతం. (చూ. ప్రేమభక్తి, పుట - 90, శ్రీ కుందుర్తి వెంకటనరసయ్య)

పుట 74 - గేయం 1

ఉత్తర రామచరిత నాటకములోని ఈ క్రింది శ్లోకం స్మరణీయం :

"లౌకికానాం హి సాధూనామ్
అర్థం వాగనువర్తతే
ఋషీణాం పునరాద్యానామ్
వాచ మర్థోఽనుధావతి" (I-3)

లౌకికులగు సాధువులు అర్థం తలచుకొని దానికి తగిన మాట ననువర్తింపజేస్తారు. ఆద్యులైన రుషులు, అర్థం అనుకోకుండానే మాట్లాడుతారు. అర్థం తరుముకొని వచ్చి ఆపలుకుల్లు నిలుస్తుంది. (ఆపలుకు నిజంగా జరిగి తీరుతుంది.)

అయితే గోపికలు ఋషులా? అంటే పూర్వజన్మలో ఋషులనే గదా! మన సంప్రదాయం.

పుట 74 - గేయం 2

చతుర్విధ వాక్కులు : (1) పరా (2) పశ్యంతి (3) మధ్యమా (4) వైఖరి.

"పరావాక్కు ఒందు రూపమున మూలాధార చక్రములో వాయువుచే సంస్కారీభూతముగా నుండును. అది స్పంద రహితము.

మూలాధార చక్రములోని వాయువు నాభికమలమును జేరి 'పశ్యంతి' అను వాక్కును వెలయించును. ఈ రెండును యోగులకు మాత్రమే అనుభవనీయములు.

జ్ఞాన ప్రధానమై, శబ్దబ్రహ్మమని వ్యవహరింపబడు చేతన మిశ్రమగు నాదము, మూలాధార ఒందువు నుండి. యిచ్ఛాజన్య సంస్కృత పవన చలనముచే నభివ్యక్తముగ నుండు శబ్దబ్రహ్మమే పరావాక్కు. ఇది యోగులకు సమాధియందు నిర్వికల్పక జ్ఞానగోచరమగును. ఆ పరాశబ్దమే నాభి పర్యంతము వచ్చు నిచ్ఛా సంస్కృత ప్రాణవాయువుచే నాభిదేశమున నభివ్యక్తమై మనో విషయమై పశ్యంతి యనబడును. ఇది యోగులకు సవికల్పక సమాధిలో జ్ఞానగోచరమగును.

నాభికమలము నుండి హృదయకమలమును జేరిన వాయువు, హృదయ దేశమున నభివ్యక్తమై బుద్ధి విషయమై 'మధ్యమ' యనబడును. ఈ మధ్యమా వాక్కు చెవి మూసికొని విన్నచో నెవరిలో వారికి వినబడును..... హృదయకమలము నుండి యా వాయువు మూర్ధమును దాకి వెనుదిరిగి కంఠతాల్వాది స్థానములను దాకుటచే వెలువడు వాక్కు వైఖరీవాక్కు. ...... వైఖరీనాదము ధ్వనిరూపమైనది. ..... ఈ వైఖరీ రూపమగు శబ్దమే యందఱకును సామాన్యముగా తెలియు శబ్దము." తెలుగు వ్యాకరణ వికాసము - పుటలు 1020, 21; కర్త : ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం.

